# పునస్సంధానశల్యము.

## అయిదంకముల (సాంఘిక) నాటకము.



గ్రంథకర్త

అవసరాల శేషగిరిరావుగారిచే

రచియింపబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు

పబ్లిషర్సు

**[illegible]డటి సన్యాసయ్య&సన్సు**

ఆంధ్రాబుక్కుడిపో, రాజమహేంద్రవరము.





టైటిల్ పేజిమాత్రము శ్రీరామాప్రెస్సునందు ముద్రితము

రాజమహేంద్రవరం.

1927

 వెల రు 0—12—0

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు



## పురుషులు.

రామచంద్రరావు—రుక్మిణితండ్రి

వెంకటశాస్త్రి—రాయబారి

వెంకటేశ్వర్లు—పెండ్లికుమారునితండ్రి

శ్రీనివాసరావు—ఒకయువకుఁడు

నారాయణరావు—రామచంద్రరావుగారి మేనల్లుఁడు.

అనంతరావు—ప్లీడరు

దామోదరుఁడు—ఒకయువకుఁడు

శ్రీరాములు—ఒకస్కూలుఫయినలువిద్యార్థి

రామారావు—ఒకయువకుఁడు

సుబ్బయ్య—బడిపంతులు

సుందరం—రుక్మిణిభర్త

రఘునాధము—మధురాపురమండలియువకుఁడు

## స్త్రీలు.

రుక్మిణి—ప్రధాననాయిక

విశాలక్ష్మి—రుక్మిణితల్లి

లక్ష్మీకాంతం—ఒకయువతి

కామాక్షమ్మ—వెంకటేశ్వర్లుగారిభార్య

మణిమాల—వేశ్య

శ్రీహరి—వేశ్యమాత

కృష్ణవేణి—రుక్మిణిచెల్లెలు




## ప్రథమాంకము.

ప్రదేశము:—రామచంద్రరావుగారి యింటివాకిలి.)

(ప్రవేశము—రామచంద్రరావు, విశాలాక్షి, రుక్మిణి,

రుక్మి—నాన్నగారూ! నాకు నేఁడు బడియందు బహుమానముగ నీ పొత్త మొసంగినారు. (అని యొక్క పుస్తకమును దండ్రి కొసంగును.)

రామ—(గ్రహించి) సావిత్రీపరిణయమా! బహుమాన మెందుల కిచ్చినారు?

రు—మా బాలికాపాఠశాలయందు నేఁటి దినమున వార్షికోత్సవము జరుపఁబడినది.

రా—అగునగును. జ్ఞప్తికి వచ్చినది. నాకును నాహ్వానపత్రికను బంపియున్నారు. కాని, తీఱిక కలుగలేదు. బాలికలచే గానము, కోలాటము, మొదలగు వినోదములు సలుపఁబడుననియును, పిదప బహుమతు లొసంగబడుననియును పత్రికలయందు వ్రాసినారు. వానిలో నీయాధిక్య మెందుఁగన్పఱ్చైను?

రు—ఎద్దియో యననేల? నేనే ప్రధానపాత్రలలో నొకటి యగు నాయికనైతిని. అందు పాత్రపోషణ సరిగనున్నదనియు, సంగీతము, అర్థజ్ఞానము, సొంపుగ నున్నదనియు,

పునస్సంధాన శుల్కము

మెచ్చి యన్నిటిలోను మెట్టబహుమానమే నాకొసంగి
నారు.

రా—అమ్మా! అందొక పద్యమును జదివి వీనులకు విందొనర్పుము.

రు—(సిగ్గు నభినయించును.)

రా—ఏమమ్మా ! సిగ్గునందుచుంటివి ? ఇట్లు సిగ్గుఁజెందు నీ కాబహు
మాన మెట్లు లభించెను ? చదువుము—

రు—నాయనా ! నీయొప్పవకున్నాకు సిగ్గెందులకు ?

ఉ. సందియమేల? సర్వ[illegible] జూడఁగ సత్యవంతు భూ
వందితుఁ బట్టుటే యరయ భాగ్యము, భోగము సర్వసంపదా
నందముఁగూర్పుమో జనక యాతని భర్తగఁ గాంచలేక యే
మందును? జీవముల్ విడుతుయార్యరో శ్రీయమునిక్కమింతయున్.

రా—వరుఁడు సర్వవిధముల నమరినవాఁడై వచో నట్లు కోరుట
శ్రేయోదాయకమేకదా. అందులకుఁ దండ్రియేమనెనో చది
వితివా !

రు—చదువకేమి ? నారదునిచే నా సత్యవంతుఁడు పరిణయమైన
నొక్కవత్సరమునకు మృతినందునని తెలిసి వలదని పెక్కువిధ
ముల నొక్కివక్కాణించెను.

రా—పిదప...

రు—మనమున నొకనిఁగోరి వేఱొక్కనిఁ జేపట్టఁజాల నని శపథ
మూనెను.

రా—తల్లిదండ్రులమాట జవదాటుటమాత్రము ధర్మవిరుద్ధముకాదా?

రు—జననీజనకులు మాత్రము తమబిడ్డల ముద్దు సెల్లింప కుండుట
పాడియా ?

రా—మంచిచెడ్డలు పిన్నవయస్కుల కెట్లు తెలియును ?

(తెరలో) రుక్మిణీ! రుక్మిణీ!

విశా.—అమ్మాయీ! ఎవ్వరో పిలుచుచున్నారు.

రు.—మా తరగతిలోని బాలికయే. (జనకుని జూచి) నాన్నగారూ! పోయివచ్చెదను.

రా.—మంచిది. (రుక్మిణి నిష్క్రమించును.)

రా.—(భార్యనుగాంచి) అమ్మాయి పెండ్లివిషయమై నీయభిప్రాయమేమి?

వి.—ఏమో మీయిష్టము.

రా.—ఎన్నివిధముల నాలోచించినను మన నారాయణరావునకే యిచ్చిన బాగుండునని తోఁచుచున్నది.

వి.—వెంకటేశ్వర్లుగారి సంబంధ మేమైనది? వారికిఁ గట్న మెంత కావలెననిరి?

రా.—అధమము నాలుగువేల రొక్కము, పుట్టెఁడు భూమియు నిచ్చిన నొకమాదిరిగఁ గుదురునని వర్తమాన మంపినారు.

వి.—అదియే లెస్సయని తోఁచెడిని.

రా.—సరి సరి. మనకున్న యాస్తియంతయుఁ జాలదు. ఇంతయు వారికర్పించి పిదప మనము చేయవలసిన దేమి? పొట్టకొట్లో గడుపుకొందమన్నను, మిగిలిన యిద్దటి యాడపిల్లలగతి యేమగును? వారికిఁ బెండ్లిం డెట్లు చేయఁగలము?

వి.—ముందుసంగతి భగవంతునిదే భారము. కట్నములు లేకపోతే కార్యము లేలేవు.

గీ. కట్నమీయక వసుఁడెందుఁ గానరాఁడు
కొలఁది కట్నంబులిచ్చిన కూడు లేదు
కట్నమే సర్వవిధములఁ గన్నపుత్రి
సౌఖ్యమునఁగూర్చ మూలమౌ సత్యమిదియు.

ఈరోజులలో నాఁడుబిడ్డల పెండ్లిండ్లనిన బ్రాణసంకటమే.

రా—పెద్ద సంబంధముల్లని విఱ్ఱవీఁగి, యిల్లుగుల్లలు చేసికొనుటయే కాని, వారు ధనమదాంధతచే నధికారముఁ జెలాయించుచుందురు. కార్యమగుదాకనే మన కుత్సాహము కాని, అయిన వెనుక బ్రదికియున్నంత కాలము విచారమే. ఏమందువా?

సీ. ముడిపడుటాదిగ మోమోటమియులేక
        యధికారముఁజూపి యాడుచుంద్రు
అనుకున్న కట్నముల్ యర్పణచేసిన
        లాంఛనా లివియంచు లాగుచుంద్రు
పరుని బంపుఁడటంచు వ్రాసిన లేఖల
        మూలకేడ్చుచు ముక్కుముడిచికొంద్రు
శౌర్యంబుఁజూపుచు సాటిలేరంచును
        నిరసన జేయుచు నీల్గుచుంద్రు

గీ. వంగివంగి సలాముల వరుసఁజూడ
నీచమనిపించు బ్రదుకింక నీతియగునె
భాగ్యవంతుల యిండ్లకుఁ బనుగులిడుట
కొలువిఁజేకొని తలగోకికొనుట కాదె?

ఇదియుఁగాక వారికిప్పుడు ధనముకూడెనుగాని తొల్లి నీచవృత్తులకుఁ బుట్టినిల్లని వినియుండలేదా? అట్టివారికి ధనమే ప్రాధాన్యముకాని మానాభిమానములతోను మర్యాదతోను నిమిత్తములేదు.

వి—తొల్లిఁటి సంగతి మనకేల? పదిరాళ్ళు కలవాఁడే యీరోజులలోఁ బలుకుబడి కలవాఁడు. భాగ్యములేకపోవుటయే పరువు, మర్యాదలు లేకపోవుట. దానదాను మర్యాదకుటుంబము లన్నీ మంటఁగలియు, దిక్కులేని కుటుంబము లన్నియుఁ

దేజరిల్లుచున్నవి. కాయాకష్టపడని బ్రాహ్మణులంతా కడకు గాళ్ళుజాపుచున్నారు. పెండ్లికుమారుఁడు మెడ్రాసులోఁ జదువుచున్నాఁడఁట. ఇదియే మంచిదని నాయుద్దేశ్యము.

రా—నారాయణరావు చాల బుద్ధిమంతుఁడు. మేనల్లుఁడు కొద్దో గొప్పో చదువుకుంటున్నాఁడు. అదియు మనమే చెప్పించుచున్నాము. పాపము! తండ్రిలేని పిల్లవాఁడు. మన కుట్టిది వానిని జాల ప్రేమించుచుండును.

వి—వాని కాస్తి యేమున్నది?

రా—రెండుయకరముల భూమియున్నది. చాలదా? ఆవెంకటేశ్వర్లుగారి కర్పింప నుద్దేశించినభూమి, రొక్కము యీతనికే యిచ్చి యింట నునిచికొన్న మనపిల్ల సుఖించదా?

గీ. వేలకొలఁది కట్నములిచ్చి విఱ్ఱవీగు
నట్టి బాంధవ్యమేలను యీదినుండి
యింటఁజెరిగెడు మేనల్లు గెంటుటరయ
స్వర్గముండఁగ నరకంబుఁ జాలుననుట.

పై వారిని గొనివచ్చి యింటనున్న సంపదలెల్ల నర్పించినను దుదకు బిడ్డకుఁ గాపురం బొసంగుననియు నిర్ధారణ సేయఁజాలము. ఇదియుఁ గాక భాగ్యభోగములు క్షణభంగురములు కదా.

సీ. కోటీశ్వరులకైన కూటికిలేకుండ
నుండెడు కాలంబు యుండవచ్చు
రాజాధిరాజైన రాజ్యమే నశియించి
యిడుమలందెడు వేళ నేఁగుదెంచు
నిలు పేదయైనను నిమిషమాత్రంబున
ధనముచేఁ దులతూగి తేనరవచ్చు
కట్టగుడ్డయులేని కాననవాసియు
నంతఃపురముఁ జేరి యులరవచ్చు

గీ. కలిమిలేముల సంగతి కానవలెనె ?
వచ్చుచును బోవుచునునుండు వరుసలేక
సాంప్రదాయము మర్యాద సానుభూతి
జూచి పరిణయ మెంచుట సొగసుకాదె?

ఇట్టి దురాశలచే నెందఱెందఱు తినుట కన్నమును, గట్ట గుడ్డయును లేక తహతహ లాడుచున్నారు. వారి కెంతధనమున్నను నీడు కాని వారితో సంబంధ మొనర్చిన తుదకుఁ దలవంపులు తప్పవు.

వి—ఈవిషయములన్నియు సత్యములైనవే కాని, కాలమునుబట్టి పరివర్తించవలెను.

గీ. త్రాగుబోతులదగ్గఱనుండి త్రాగకున్న
జూదరులయందుఁ జేరియు జూద మాడ
కున్న నిలువనిత్తురే యది యుత్తమంబె
యంచు హేళనసేయరె వంచనముగ?

ధర్మమైనను నధర్మమైనను దోడివారలఁ గూడకున్న నిందలకుఁ దల దాల్పవలెను.

రా—అతివా ! నీయుపన్యాసములు కడుశోచనీయములు. లోకులకు వెఱచి యన్యాయము లాచరించుట తగునా ? ఇప్పుడు మన రుక్మిణిని నారాయణరావున కొసంగిన వెలివేయుదురా ?

వి—వెలివేయుదురని కాదు. చేసిననాఁటనుండియును బేర్లుపెట్టుదురు.

రా—దాని యభిప్రాయమునుగూడ గనుఁగొందమా ?

వి—ముక్కుపచ్చలారనిది దాని కేమి తెలియును.

రా—అట్లుకాదు. ఇంతలోనే పోయిన దేమున్నది ?

వి—అయినఁ బిల్చెదను. రుక్మిణీ ! రుక్మిణీ ! (అని పిల్చును.)

(తెరలో)

వచ్చుచున్నానమ్మా (అని రుక్మిణి ప్రవేశించును)

రా—అమ్మా! సావిత్రీపరిణయమునుగూర్చి బాగుగ నెఱుఁగుదువుకదా. ఈపటములలో నీకునచ్చిన దేదియో తెల్పుము.

(అని రెండుపటముల నొసంగును)

రు—(సిగ్గునభినయించును)

రా—అమ్మా! సిగ్గువలదు. (అందొకదానిని జూపి)

గీ. ధనముకలవాఁ డితండును దగిన పగిది
విద్య నభ్యసించుచునుండె విలువకలదొ
(రెండవదానిని జూపి)
యితనిఁ జెప్పగనేటికి యితఁడె నీదు
బావమఱఁదియు మేనత్తబాలుఁ డగును.

రు—నాయనగారు! మంచిచెడ్డల మీ రేయెఱుఁగుదురు.

వి—చూచితిరా! ధనవంతుఁ డెల్లఱకును బ్రియుఁడే. విద్యాబుద్ధుల నారితేరిన మన యీముద్దులబిడ్డ నెంత దగ్గిఱబంధువైనను బేదవాని కిచ్చుటకు మనం బొడంబడకున్నయది.

రుక్మిణి—(వెలవెలబారు మోమున జూచును.)

రా—తక్కిన విషయములఁ గూడ నెఱింగించెదను. అమ్మా! ఇతఁడు చాలధనవంతుఁడు. దినదినము వేనకువేలు సంబంధములు వచ్చుచున్నవఁట. ఈదినములలో నెంతటి బీదవానికైనను వరకట్నమర్పింపక తప్పదుకదా. ఈతనికే పరిణయమొనర్చునెడఁ బుట్టినభూమియు, నాలుగువేల రొక్కమును నీయవలయును. ఇందు నీయభిప్రాయ మేమిదో విస్తరించి చెప్పుము.

రు—అమ్మయ్యో! అంత కట్నమే! మన కున్నయాస్తి నంతయు నీయవలసిన దేనా? తరువాత మీాకుఁ దిండియో—

వి—పసిబాలవు. అవన్నియు నీకేల?

రు—అమ్మా! ముందు వెనుక లారయవలదా? నాకే యింతధనము వెచ్చించిన నిఁకఁ జెల్లెళ్ళ కెట్లు బెండ్లిండ్లు సేయఁగలరు? ఇంతేకాక,

గీ. కట్నముల్ పొందునరులను గట్టుకొన్న
పాపహేతువుకాదొక్కొ పరులదేల?
బావకేయిచ్చి నన్నును బరిణయంబు
సేయుటొప్పగుఁ దండ్రిరో చింతలేల?

బావకు నాయం దెంతయో ప్రేమ. నామూలమున మీాఱందఱు తినఁ దిండిలేక కట్టగుడ్డ లేక పరితపించుట మాత్రము నాకుఁ శ్రేయోదాయకమా?

రా—సరే. నీవు పోయి యాడుకొనుము.

(రుక్మిణి నిష్క్రమించును.)

వి—ఏమైనను సరియేకాని అన్నిటికన్న నా కాసంబంధమే నచ్చినది. శుభలేఖను బంపుఁడు. మనకుఱ్ఱదాని సుఖము మనకు వలదా? సమస్తవిద్యలు నేర్పినందులకు ఫలితమేమి? మీా యిష్టము ననుసరించి యొనర్పుఁడు. నేను బనులకుఁబోవలెను.

(అని నిష్క్రమించును.)

రా—ఎన్నివిధములఁ జెప్పినను జెడచెవిని బెట్టుచుండెనేకాని వినదొల్లదయ్యె. ఉన్నదంతయు నల్లున కొసంగిన నిఁక గతియేమి? హా! దైవమా! మాకిఁకముం దెట్టిగతులఁ గల్పింపనుంటివో కదా. ఈకట్నములే భువి నంసారుల మ్రింగుటకే తెంచిన బ్రహ్మరాక్షసులు కాఁబోలును!

సీ. వరకట్నముల(జూడ వలదని నీతుల(
    జెప్పెడువారలే చేరి రిందు
పేరుల(జూపుచు( బేపర్లపై నిజ
    బుద్ధిమంతులె నేడు మూర్ఖులైరి
సంఘసంస్కరణంచు సభల(జేసెడువారు
    ముందంజవేయ(గ మొదలిడి రిక
దేశోపకారంబె దివ్యతేజంబను
    శుద్ధవేదాంతులే శుంఠలైరి
గీ. కటకటా! ధనమును జూడ( గాలుదువ్వ
వా(డులేకున్న ధనకాంక్ష పరువు నింద
లెక్కసేయ(గ నిచ్చునే నిక్క మిదియు
ధనమె మూలము జగతిని దప్పకుండ.

---

## రెండవరంగము

(ప్రవేశము:—విశాలాక్షి, లక్ష్మీకాంతం.)

ల.—వదినా! ఏమిచేస్తున్నావు? ఎప్పుడుచూచినా యేదో యొక యాలోచనయ్యే. మాఅన్నగారు కచ్చేరీకి వెళ్ళినారా యేమి?

వి.—ఆ. ఇప్పుడే వెళ్ళినారు. ఆలోచన కేమున్నది! ఆ(డుబిడ్డల( గనుకే యాలోచన—

ల.—ఆవేళ కెవ్వ(డోవస్తాడు. మన మెన్నియాలోచనలుచేసిన, బ్రహ్మవ్రాసిన వ్రాత తప్పదుకదా! ఈపిల్లపెండ్లికే బెంగపెట్టుకుంటే తక్కినవాళ్ళకో—

వి.—అదికాదే, కట్నాలుమాట వింటే కడుపు బద్దలవుతోంది.

అదేమి చిత్రమో కాని, కూటికి లేనివానికిఁగూడ కట్న పేకుయే.

ల___కాలధర్మమమ్మా ! ఇచ్చేవాళ్లుంటే పుచ్చుకునేవారికి నొప్పేమి? రుక్మిణికి సంబంధము కుదిరినదా ?

వి___ఇంకా లేదమ్మా. దానినిగూర్చియే యిన్నియాలోచనలు.

ల___ఎక్కడో కుదిరినట్లున్నది. నాతోఁ జెప్పకూడదా ? పోనీలే. పెండ్లినాఁడైనా తెలియదా ? (అని మూతి ముడుచును)

వి___నీకన్న మిత్రులెవ్వరు ? ఇంకా యెక్కడామాత్రం లేదు. ఆనడుమ నరసింహము శాస్త్రిలుగారు ప్రయత్నముచేసి కట్నమీయలేక యూరుకున్నారు. జ్ఞాపకమున్నదా ? అదే.

ల___వారు చాలా ధనవంతులఁట. సాలుకు నాలుగైదువేలు భూము లమీఁద ఆదాయము వచ్చునఁట. కొంత నిల్వయున్నదఁట. ధైర్యసాహసము లుండాలి. చేస్తే అలాటి సంబంధమే చెయ్యాలి. కుఱ్ఱది సుఖపడుతుంది. పిల్లవాఁ డొక్కఁడేకాఁబోలును. పిల్లకి స్వేచ్ఛ. రుక్మిణి అదృష్టవంతురాలు.

వి___అన్నీ బాగానేయున్నాయి. (అని యూరకుండును.)

ల___అడ్డేమి వచ్చినది ?

వి___కట్నము మాటేనమ్మా.

ల___అన్నగా రొడంబడకున్నారా ?

వి___ఒడంబడ కేమిచేస్తారు ?

ల___మాఅన్నగారిని వెఱ్ఱివానిని జేసి అనినమాట చెల్లించుకుంటున్నావు. కట్న మేమాత్రము ? ఎన్ని సంచులు ?

వి___నాలుగువేలు రొక్కము. పైగాఁ బుట్టెడుభూమి.

ల___అబ్బో ! కట్నమెంతైనా సంబంధముమంచిది. మీవారి యభిప్రాయ మేమి ?

వి__వారిదివలదనియే చెప్పుచున్నారు. కాని చేయకతప్పదని చెప్పి నాను. ఏమందువా? పెద్దపిల్ల యిదేకదా! దీనికే ముద్దుముచ్చటలు తీరకపోతే తరువాత యేమో__

ల__అగునమ్మా. ఏది శాశ్వతము? ఈవేళనో రేపో యేమనుష్యుని ప్రాణము నోరుదెఱచునో యెవ్వరెఱుంగుదురు? ఎప్పటిసరదా యప్పుడు. మంచిపని చేసినావు. మీమాత్రం నరసింహశాస్త్రులుకుంటే వారు వీరు చెప్పవలెనా! మీకేమిటమ్మా బోలెడు భూమి. పైగా నెలకు నూటరూపాయిల యుద్యోగం. ఈమాత్రం కట్నములేకుండా సంబంధమువచ్చునా?

వి__అవునే. నీకండఱును మగపిల్లలే కనుక నెన్నిగొబ్బర్లయినా చెప్పుతావు.

ల__(ముసిముసినవ్వు నవ్వుచు) మాపెద్దాడి కిప్పుడు పదవయేడు. సంబంధములు వస్తున్నాయి. మేమే బుర్రనూపుటలేదు. ఏదో యొకటి ఖాయముచేసుకోవాలి.

వి__కట్నాలెంతెంత?

ల__అవే యింకా తేలడంలేదు. ఓవిడా! క్రొత్తమాట విన్నానేమిషి?

వి__ఏమది?

ల__నరసమ్మగారి కుఱ్ఱదానికిఁ గార్య మాగిపోయినదఁట!

వి__అదేమమ్మా! ముహూర్తము దగ్గఱకు వచ్చుచున్నదని పనులు చేసుకుంటున్నారఁట కాదా?

ల__ఈకట్నముల గొడవే. పెండ్లినాటి కట్నముబాపతు బాకీమిగిలినదఁట.

వి__రామ రామ. ఎక్కడఁజూచినా పెండ్లిండ్లు కట్నము, విడాకులు దేశమున కెట్టిదురవస్థ పట్టినదమ్మా. పాపము! నరసమ్మగా

రానాఁడు పెండ్లికిచ్చిన రెండువేలరూపాయలున్నూ యింతవఱ
కీయలేదఁట. నీకొడుకులకు నీవేమి చేసెదవో ?

ల—వంటకు వేళయినది. పోతానమ్మా.

వి—మునుపటివలె రావడం మానివేసినావు.

ల—రాకేమమ్మా. ఏదోయొకపని, వెళ్లుతాను. (అనినిష్క్రమించును.)

(తెరపడును)



మూడవరంగము



(ప్రవేశము— రామచంద్రరావు, వెంకటావధాని.)

రా—అయ్యా ! విశేషములేమి ? పండా కాయా ?

వెం—(తనలో) ధనములాగుట కిదియే సమయము. ఎంత సుఖముగ బోయివచ్చినను బడరాని కష్టములం బడితినని చెప్పవలెను (ప్రకాశముగ) పండు కాయమాటటుండ, అబ్బబ్బా ! ఏమి ప్రయాణమండి. అంతకన్న నరణ్యమార్గము మేలుబాబూ ! ప్రాణాలన్నీ కొంటికి వేసినది. నాజన్మలో నేనెప్పుడూ యింత కష్టపడలేదండి. పెద్దవాఁడను. మీరు వెళ్ళక తప్పదంటే మాటతీసివేయలేక బయలుదేరినాను. కాని...శివ, శివా...

రా—అవధానులుగారూ ! మీకష్టమునకుఁ దగిన ప్రతిఫలముఁ జూపెదనులెండు. విషయమేమిటో వినిపింపుఁడు. సానుకూలమగునట్లు తోచెనా ?

వెం—(తనలో) అమ్మయ్యా ! ఇప్పటికి నామనసు కుదురుపడినది. (ప్రకాశముగా) నేను వెళ్ళడం కార్యానుకూలం కాకపోవడమునా ? కాని...డబ్బు...

రా—(విభ్రమముతో) కట్నము మునపటికంటెను వృద్ధియైనదా ?
వెం—అయినదా యంటే యాశ్చర్యమేమి బాబూ !

సీ. వరునికట్న మటుండ వానివరుసలఁజూచి
చుట్టాల నెనరుతో జూడవలయు
వియ్యపరాలికి వేయిహూణ్యములైన
ముచ్చటలన్ దీర్పవచ్చునేమొ
ఆడపడుచులకును నైదారువందలు
వెచ్చింప నొకతీరు వేగవచ్చు
పెండ్లికివచ్చిన పెద్దలందఱకును
దగునట్లు బహుమతుల్ తప్పకుండు
గీ. ఇన్నిరీతుల ధనము నిచ్చుచోడ
లాగనన్నారు వీలున్న సాగవచ్చు
ధనము ముందుగఁ జూడక తరలమంచుఁ
జెప్పవచ్చితి నేనిందు శీఘ్రగతిని.

అసలు కట్నముకంటె నీకట్నము లెక్కువైనవి. వరకట్నము కాక పైగా రెండువేలైనా చూడవలెను.

రా—కట్నము ముందుగా నచ్చుటకుఁ బంపించవలెననిరా ?

వెం—అచ్చటకుఁ బంప నగత్యములేదుకాని రొక్కముఁ జేతఁబట్టి యుంచవలెను. మీవియ్యంకుఁడుగారు అబ్బబ్బా ? ఏమిసాహసమండి. డబ్బుకీ ప్రాణానికి లంకె. వలయునెడఁ బ్రాణమునైన వీడునేకాని ధనము వీడని మహానుభావులు. మీవలన వారికిఁ బెండ్లికాలమందు రావలసినలాంచనాలు డబ్బు డబ్బు చొప్పునసే కనుబెట్టినారు. దినదినము నెన్నెన్నో పెండ్లి కార్యములఁజేయించు బ్రాహ్మణునకైనా యవన్నియు జ్ఞాపకముండవు. మీరు నమ్మఁడు నమ్మకపోవుఁడు, జాబితావ్రాసి

జాగ్రత్తచేసినాడు. ఆపెండ్లి అయిదురోజులు మా ట్లాయన
తో వేగదరోకాని, అయిదుయుగములవలెఁ దోచును.

రా—దాని కేమిలెండు. ఇవ్వఁదలఁచిన దెప్పుడో యొకప్పు డివ్వక
తప్పదు కదా!

వెం—బాబూ! నేను మీతాతలనాఁటినుంచి మిమ్ములను బాగుగా
నెఱుఁగుదును. ఎప్పుడూ యొకరి కిచ్చుటకాని, యొకరియొద్ద
బుచ్చుకొని యెఱుంగరు. తొలుతనుండియు నన్నవస్త్ర
ములకు లోటులేని మర్యాదకుటుంబము. అయ్యా! మీ కు
టుంబముసం దుండెడు వాత్సల్యముచేఁ జెప్పుచున్నాను. బా
బూ! మన కీసంబంధమువలదు. ముమ్మాటికిని వలదు. వారి
దీనాఁడు ధనమునుబట్టి వచ్చిన మర్యాదకాని, ఆదినుండియు
నున్నదికాదు. నాయనా! ఇప్పుడంటే యన్నియు నశించినవి
కాని యింతకుముందు పిల్లనిచ్చెడువారు సాంప్రదాయము,
పదిమంది కలవారగునా కాదాయని చూచెడివారు, కాని,
యిదియేమిపాపము! ధనమే ప్రాధాన్యము. సాంప్రదాయ
మక్కరలేదు. పైగాఁ జూచినావు నాయనా! మర్యాదమా
టేలేదు. కులమసలేలేదు. ఇది కాకుండా పిల్లనిచ్చువారి
కోర్కెలన్నీ వింటే యాశ్చర్యమే. పిల్లవాఁ డొకఁడేయుం
డవలెను. పిల్ల కాపురమునకు వెళ్లునరికా యత్తమామ లుం
డరాదు. రామ రామ! ప్రపంచకము రీతంతయు నీరీతిని
మారినది. ఎంతయో కాలమునుండి తినుటకు ముద్దలేనివా
రెల్ల భాగ్యవంతు లగుచున్నారు. అట్టివారికి ధనముతో
పాటు వినయమాది సుగుణంబు లెట్లలవడును? ఎల్లవేళల
లేమిచే బాధపడువాని కింతుక తినుటకు గూ డలవడిన సాధా
రణముగా—

సీ. తన కులహీనతఁ దాఁ గప్పిపుచ్చియుఁ
బెఱవారి కులములఁ బేర్లు వెట్టు
నిజగుణంబులఁ దాఁచి నిరసన జూపుచు
సుగుణాత్ములనుజూచి సురిక్కుచుండు
తండ్రితాతలనాటి తమశీల మెంచక
దుశ్శీలు రంచును దూఱఁదొడఁగు
బంధుజనులఁ జేర భయమందెడు నతండు
బంధుజనులఁ జూచి పరిహసించు
గీ. కలిమివచ్చినదాదిగఁ గనులమూసి
తనదె యధికారమంచును దానె యెల్ల.
వారికిని దిక్కగునటంచు ప్రల్లదముల
మీఱివల్కుచు నెల్లెడ మిట్టిపడును.

రా.—అయితే, మీ యభిప్రాయమేమి?

వెం.—క్రోధము వచ్చునేమో. అయిన నడిగితిరి కానఁ జెప్పెదను. మీ మేనల్లునకు—

రా.—అవధానులుగారూ! అందులకుమాత్రము నామనం బొడంబడకున్నది. ఎంతదగ్గిరబంధువైనను ఆస్తి తక్కువ. ఇదికాక తోడివా రాక్షేపణలకుఁ గడంగుదురు. ఏమిసేయనో చెప్పండి. ఈపెద్దపిల్ల కిట్లు పోనివ్వండి.

వెం.—(తనలో) పెద్దపిల్ల దిట్లుపోతే చిన్నపిల్ల కాలోచనయే యక్కఱలేదు. (ప్రకాశముగా) ఆకట్నమే యీతను కీయరాదా?

రా.—(ఊరకుండును)

వెం.—(తనలో) రోగి కౌషధసేవ రుచించునా? ఈపెండ్లితో వీనిపని సరి. తరువాత రెండవపిల్లకు మేనల్లుఁడే గతియగునన్నమాట సత్యమగును. ఈరీతిగఁ గరలిపడెడువా రెందఱు కూటికి

లేకుండఁబోయిరి. చెప్పవలసినదేమో చెప్పితిని. కందకులేని దురద బచ్చలి కెందుకన్నట్లు యీనిష్ఠూర్యము నాకేల ?
(ప్రకాశముగా) పంతులుగారూ ! కానిండు. మీరుమాత్రము తెలియనివారా ? వారి కనేకసంబంధములు వచ్చుచున్నవి. అదే కావలసినచో ద్వరపడవలెను.

గీ. కాలయాపనమైనచోఁ గట్టకడకు
వేలములఁ బాడవలయును విరివిగాను
సద్దుశాయక వెనువెంట సమ్మతింపఁ
గబురు సంపంగ శ్రేయమా కమ్మవ్రాసి.

రా.—అగునగును. అదియును సత్యమే. దయయుంచి మీరేపోయి రండు.

వెం.—వారి కోరికెల కన్నిటికిని నొడంబాటేకదా.

రా.—కాకున్న మీరిపోవును.

వెం.—అయిన సరియే. నామాట—

రా.—మీవిషయమై వేఱుగఁ జెప్పవలెనా ? ఎట్లో వీలునుబట్టి ఈ సంబంధమును గుదిర్చితిరా మిమ్ములఁ బూతిగా సంతోష పెట్టెదను.

వెం.—నాశక్తినంతయు వినియోగ పర్చెదను. వారు కోరిన కట్నమంతయు నిచ్చుటకు సంశయము లేదుకదా.

రా.—వగదు నాలుగువేలు యిచ్చుటస్థిరమే. మనకున్నది పదియకరములు. అందులోఁ బట్టెఘనేల యిచ్చివేస్తే తక్కినరెండు యకరములమీద నాలుగువేలు బదులుదొరకునా ? యని వెఱచుచున్నాను. అదియే నాసందేహము.

వెం.—ఈభూమి మీపిల్లపేర వ్రాయుటయా ? లేక వరునిపేర వ్రాయవలెనా ? ఇదివఱ కాప్రస్తావన ఏమైనవచ్చినదా ?

రా—రాలేదు. ఎట్లయినను సరియే.

వెం—అంటే ఈరోజులలోఁ దండ్రి లక్షాధికారైనా, కొడుకు భిక్షాధికారి యగుచున్నాఁడు. అందుచేత నేటినుండి తొట్టువచ్చినా పిల్లపేరనే వ్రాయించుచితిమి.

రా—వారందుల కొడంబడకున్న—

వెం—అయితే మీచిత్తము. నేనుబోయివత్తునా ?

రా—చిత్తము.

వెం—చెప్పమఱచితిని. పిల్ల కలంకారముల విషయమేమిటి ?

రా—అది వారి యిష్టముతోఁ గూడుకొన్నది. మనము వక్కాణించ కూడదు.

వెం—సరి సరి. బాగున్నది! అన్నీ వారిష్టమేనా ? వారు చెప్పెడి ప్రతివిషయమునకుఁ దల లొగ్గవలసినదేనా ? చాలుఁ జాలు! ఈమాత్రం కట్నమిస్తే దీనియబ్బ సంబంధ మింకొకటి యుండును.

రా—ఆగ్రహపడక సమాధానముగనే మీయిష్టము వచ్చిన ట్లొనర్పుఁడు.

వెం—నాకు సెలవు.

రా—చిత్తము. (ఇరువురు నిష్క్రమింతురు)

(తెఱ పడును.)

వెం—(ఈవలి కరుదెంచి) ఆహా ! ధనమనిన ఘేమినిర్లక్ష్యముగానున్నది. నాలుగువేలు రొక్కమా ! పుట్టెడు భూమియా ! పైగా లాంఛనములా ? ఇన్నియు నర్పించినా చోరునిభంగి వంగి వంగి మూలల దాగవలసిన దౌర్భాగ్యదశయేకదా. ఒకటి రెండేండ్లు గతించిన వెనుక నింకదావాలు, పిటీషనులు,

డిక్రీలు, టంటంలు. ఇదియేకదా బుద్ధిజాడ్యము. ప్రపంచ
ములోఁ గోరి తెచ్చుకొన్న చింతలుకొన్ని రాఁదలచి వచ్చి
నవికొన్ని. కాని చేసేటప్పుడున్న సంతోషము అనుభవించే
టప్పుడుండదు. పోనీ నాకేల ? సంసారాలన్నీ యీలాగే
నశిస్తున్నాయి. గడించేవాఁ డొకఁడు గుణించేవాఁ డింకొ
కఁడు. మర్యాదంటే: కజ్జి, చిప్ప చేతికిచ్చిన తరువాత నింకె
క్కడి మర్యాద. అన్నీ మంటగలుస్తాయి. తానేదో పెద్ద
సంపాదిస్తున్నానని యాశ. ఈయుద్యోగాలు శాశ్వతమా?
కాలుసేతు లాడినంతవఱకు ఉద్యోగముకాని, ఒకరోజు తల
నొప్పివచ్చి ఆఫీసుకు వెళ్ళకుంటే అయ్యవారి కాదినమున
జీతం నష్టమే. ఏనాఁడో పెద్దలుసంపాదించి స్తే తానుదెచ్చి
నా లేకున్నా దర్జాగా పోతున్నది. నాయనగారి దర్జా
యిఁక ముందు తెలుస్తుంది.

ఎందఱు పకీరులైరి యింకెందరగుదు
రొక్కొ ! యిన్నియును గలుగ నిక్కమెన్నఁ
దలకుమించిన వ్యయమగుఁ దప్పకుండ
తోఁప చింతయుఁ జెప్పిన దుష్టమతిని.

(అనుమ నిష్క్రమించును.)




## ద్వితీయాంకము.

ప్రదేశము—వెంకటేశ్వర్లుగారి గృహము

(ప్రవేశము—వెంకటేశ్వర్లు, కామాక్షమ్మ)

కా.—అబ్బాయికి సెలవు లెప్పుడిచ్చెదరు?

వెం.—నేటితో నెల సరికదా. ఎల్లినుండియే సెలవులు ప్రారంభమగును.

కా.—ఈసెలవులలోనైనా అత్తవారింటికి బంపించెదరా?

వెం.—(కోపదృష్టితో) నాయెదుట వారిమాట నెత్తకుము. ఎంత మోస మెంత మోసము! పెండ్లికాలమందు నాలుగువేలు రొక్కము, పుట్టెడు భూమి యిచ్చెదమని ప్రాకులాడి ప్రాకులాడి తమ పని తీరెనుగదా యని రెండువేలు బకాయిపెట్టినవారి ముఖము చూడవలె యున్నదా? ఆ రెండువేలు యిచ్చిననే కాని, మనవాడి నచ్చటకుఁ బంపుటకు వీలులేదు. అవు నన్నవాని నన్నిటిని వదులుకుని యేదో బలుకుతుందను కుంటే మొదటికే మోసము వచ్చినది. తుదకు బనికిమాలిన సంబంధము దొరకినది.

కా.—హరి హరీ! నిష్కారణముగ వారి నేలదూషించెదరు. వారికున్న పదియెకరములలోను నేనిమిదియెకరములు, పిల్లపేర

వ్రాయుటకు వీలులేదంటే మీయిష్టానుసారము, మనఖాతా పేరనే ప్రాస్తి రిజిష్టరీ యయినచేకాని పుస్తి మడి [illegible]కు వీలు లేదంటే రిజిష్టరీచేయించి, పెండ్లిలో నెక్కడేలోటు వచ్చునో యని, అడుగులకు మడుగులొత్తుచూ యింతాచేస్తే తుదకుఁ బనికిమాలిన సంబంధమైనదా? అబ్బాయి అలక పాన్పునుండి రాకుంటే, వాడి కోరికప్రకారం రిస్టువాచీకి రెండువందలు, మోటార్ సైకిల్‌కు ఆరువందలు, అదీ యిదీ అని యేలాగున లేదన్నా వేయిరూపాయి లిచ్చినారు. ఈపెండ్లికి మిగిలిన రెండుయెకరములు తనఖావ్రాసి రెండువేలు తెచ్చినారు. ఆరూపాయిలు రెండేండ్లలో రెండువాయిదాలపైని యివ్వకుంటే ఆభూమి ఋణదాతలకుఁ జెల్లవలసినదేయఁట. ఇన్నివిధములఁ జేసినా యింకా వారికి మీవలన దూషణలు తప్పినవికావు. ఆమిగిలిన యిద్దరిపిల్లలకు వివాహము లెట్లు చేయుదురో తెలియదు. మీకివ్వవలసిన రెండువేలకు నోటు వ్రాసి యిచ్చిరికదా. ఇంకను వారి లో టేమియున్నది.

వెం—లోటా? అంతా లోటే. ఆనో టెందుకు నాలుక గీచుకొనుటకా? ఆభూమి మనపేరనే వ్రాయకూడదా? మిగిలినభూమి తనఖాదారే వేసుకొనును. నేనుమాత్రం తక్కువ వాఁడనా? దీనికి ముందే ప్లాను వేసియుంచానులే. ఇల్లు నాలుగువేలకిమ్మత్తుంటుంది. తరువాత వా రేలాగైతే మనకేమి?

కా—మంచిప్లానే.

వెం—నీనోట్లోనువ్వుగింజదాగదు. ఇంకా యెక్కడా అనకు.

కా—అగును. నిజమాడితే నిష్ఠూర్యము తప్పదు. మీరు దూషింపనూవచ్చు. నేను పడనూవచ్చు. కాని, రేపది యెటులున్న

ను, అబ్బాయి నొకమారు పంపించుమంది. వెంటనే తిరిగి వచ్చును.

వెం—ఛీ! ఛీ! వాళ్లింట నడుగిడుటకు వీలులేదు. ఇప్పుడే వచ్చెద నంపుము.

కా—(చేయిఁ బట్టుకొని) ఎచ్చటకుఁ బోయెదరు ?

వెం—వీథిలోనికిఁబోయి వచ్చెదను. ఎవ్వరో ద్వారముయొద్దఁ గేక లిడుచున్నారు.

(అని నిష్క్రమించును).

కా—అక్కటా ! దేశమున కెట్టిహైన్యత సమకూడినది. కడుపున నొక్కపిల్ల జనించిన గన్నవారు చిప్పను గట్టను జూచుకొన వలసినదే కదా.

సీ. పూటకన్నములేని పురుషాళికినిగూడ
విరివిగఁ గట్నముల్ వేలు వలయు
మాటాడనేరని మానవపశులకెల్ల
విరివిగఁ గట్నముల్ వేలు వలయు
కట్టగుడ్డయులేని కడుబీదలకునెల్ల
విరివిగఁ గట్నముల్ వేలు వలయు
సాంప్రదాయములేని సన్యాసులకునైన
విరివిగఁ గట్నముల్ వేలు వలయు

గీ. పురుషుఁడై జన్మమందిన బోత్కెఁ జూచి
పాపుఁడైనను మఱి యెట్టి పందయైన
శుంఠయైనను దప్పదు శుల్కమీయఁ
గటకటా యెట్టిదుర్దశ కలిగె నేఁడు.

నగదుకట్నము లీయకున్న ప్రాంసరీనోట్లయిన దప్పవఁట. ఇఁక భూములకట్నమైన దస్తావేజులు ముందుగ రిజిష్టరీ

అయిననే తప్ప ముడిపడుటయే కల్ల. అయ్యో! ఈకట్నము
లమూలమున వేనకు వే లాదాయము వచ్చు సంసారము
లొక్కక్షణములో మంటఁ గలియుచున్నవి. అట్లీయకున్న
బెండ్లిండ్లగుట లేదు. అక్కటా! ఆడుపడుచులఁ గన్న తల్లిదం
డ్రులు కన్యాదానఫలంబు లంది గంతికొక్కటకు మాఱుగఁ
బరిణయము లెట్లు చేయనగునో యని వెంగఁగొనుచున్నారు.
కలికాలమున నిదియే గాఁబోలును.

గీ. వరుని కట్నమటన్నను వరుని వీథిఁ
బెట్టి యమ్ముటయందును భీతిలేదు
పాపభీతిక వెఱగందు వరుసలేదు
న్యాయమంతయు నేమూల నడఁగె నొక్కొ.

(తిరుగ వెంకటేశ్వర్లు ప్రవేశించును).

వెం.—ఏమిరో దీర్ఘాలోచన సేయుచున్నావు?

శా.—ఆలోచన కేమున్నది. ఎప్పుడు చూచినా, వడ్డీలు, పత్రాలు
లెక్కలే కాని, నగలా నాణెములా? శుభ్రమైన వస్త్రమా?
విచారములు మీకుఁ దప్పవు. నాయాలోచనల కేమి కాని, ఆ
వచ్చినవా రెవ్వరు?

వెం.—(చిద్విలాసముతో) శుభలేఖ వచ్చినది. నేను జెప్పలేదా? ఓసి
కతోనుచులే సమయము రాకుండునా?

శా.—(తత్తరపాటుతో) ఏమది? కోడలు రజస్వలైనదా?

వెం.—ఆ. అదే లేఖ.

శా.—ఎప్పుడు? శాంతియున్నదా?

వెం.—నాలుగుదినములైనది. శాంతి లేదనియు, సాధ్యమైనంతత్వర
లో శుభము జరిగించుకోవలసినదనియు వారే వ్రాసి పంపి
నారు.

కా.—అయితే కాలయాపన సేయక ముహూర్త మేర్పాటుఁ జేయించుడు.

వెం.—ఇప్పు డంతత్వరలోఁ జేయకపోతే పుట్టిమునుగునా ?

గీ. రెండువే ల రొక్కముఁగాక రెండుయేండ్ల
వడ్డి సహితము సర్పించి పైగ నింక
వేయిరూప్యము లిచ్చిన వెడలనగును
గాక, కార్యంబు సేతునే కడకు వినుము.

కా.—అయ్యయ్యో! అదేమిగ్రిహచారము! కార్యముఁ జేయకుండి సలోకులు నిలువనిత్తురా? ఎదిగిన బాలను బుట్టినింట నుంచుట పాడియా? ధర్మవిరుద్ధము కాదా? లోకనిందలకైన వెఱువవలదా? ధనమే ప్రాధాన్యమా? నీతులన్నియు నసించెనా? న్యాయాన్యాయము లడుగంటెనా?

వెం.—నీకుఁ బిచ్చిపట్టినట్టున్నది. లోకు లేడ్చిననుసరే. మొత్తుకున్ననుసరే. పుణ్యమే రానీ పాపమే రానీ. న్యాయమైననుసరే. అన్యాయమైననుసరే. తలఁచినంత చేయవలసినదే.

గీ. పుణ్యపాపంబులంచును పొంచియున్న
నిందలను లెక్కసేయుచు నిలచియున్న
దయలఁజూపుచు నింటను దాగియున్న
ధనముఁగూర్పంగ వశమౌనె ధాత్రికైన.

కా.—నిజమే కాని, మీకున్న ధనము చాలదా?

వెం.—చాలుటకు దీనికింత యని యంతుకలదా? వందలున్నవాఁడు వేలకొఱకుఁ జూచును. వేలున్నవాఁడు లక్షలకొఱకు కెత్తించును. లక్షలున్నవాఁడు కోటికి పడగెత్తవలెననును ఏమాదిరిగనో యిఁక పదివేలు వెక్కవేసినచో మన రెండవఅబ్బాయి

బియ్యం మిగులును, ఘోష్టులోఁ కార్డువేస్తే మూఁడవనాఁటికి రాదా? ఛత్రీఖర్చులిచ్చి బ్రాహ్మణుడా పైగా దానికి బహుమతికావలెనఁట. బహుమతులు పైపైనున్నవా? ఆ వాఁడెమ్మ పంపడం ఈ వాఁడెమ్మ రావడం. ఇద్దఱికి సరి పోయినది. ఇక్కడ దాఁచిపెట్టినవకున్నాఁము కాఁబోలును.

కా.—బహుమతులివియే చాలునుగాని, ఒక్కపూట బ్రాహ్మణునకు భోజనముఁ బెట్టకూడదా?

వెం.—మనమైతే యేగంజినీళ్లతోనో తింటాము. పైవాఁడు చేరితే పప్పు, కూర, పులుసు, యివన్నికావాలి. మనకు తవ్వెడు బియ్యమైతే మూఁడునాళ్ళకు సరిపోవును. వాఁడికొక్కపూటకు సరిపోవు. భోజనము లేపైఁబై, నున్నదా? తెచ్చేవాళ్ళకుఁ గష్టముకాని, యెన్ని కబుర్లయినా చెప్పవచ్చును. నే నీధనమంతా యెంతకష్టపడి సంపాదించినానో వింటే తెలుస్తుంది. చెప్తాను విను.

సీ. తండ్రి పోవుసరికి దమ్మిడీలేకున్న
చెంబుఁ జేతనుబట్టి చేర్చినాను
కూలినాలికిఁబోయి కూటసాక్ష్యములిచ్చి
కూడైనఁ దినకుండఁ గూర్చినాను
కట్టగుడ్డఁగొనక కర్చ్చుగుసంచును
బ్రాతబట్టలతోనె బ్రదికినాను
తాకట్టులనుబట్టి తబ్బిబ్బు పడకుండ
వంచించి యవి తస్కరించినాను

గీ. మానమభిమానమనకను మసలినాను
తగిన తనఖాలఁ బట్టుచుఁ జరిగినాను
అధికవడ్డీలసొమ్మును నధికపఱిచి
ధనముఁ గలవాఁడనైతినే తథ్యమింత,

కా—ఓహో! చాల గష్టపడియే సంపాదించినారు. ఇంతటి బహుళ జాముగా నవలెను. పోయి వచ్చెదను.

వెం—తర్కవితర్కంబులైనవా?

కా—(ఏదియో వినుట నభినయించి) ఎవ్వరో తలుపుఁ దట్టుచున్నారు. చూడండి.

(వెంకటేశ్వర్లు నిష్క్రమించును).

పెండ్లిండ్ల కష్టములే పెరిగి సంసారులను సన్యాసులుగ మార్చుచుండఁ బైగాఁ గొత్తకష్టము లేర్పడినవే.

సీ. నవమాసములు మోసి నరకబాధనుబొంది
ఓర్పునఁగనుటయే యొక్కచింత
కనిపాడిగ వారిఁ గాచుచుఁ బెంచుచు
నానరింపఁ బెద్దగ నొక్కచింత
వయసువచ్చినవెన్క వరులకై యత్నించి
యొప్పైన చోటీయ నొక్కచింత
ఖడ్గవాదము లేక కాపురంబునుగూర్పఁ
జక్కసేయుటకునై యొక్కచింత

గీ. ఉచితరీతులనుండగ నొక్కచింత
ఇన్నిచింతలుదట్టఁ జేరి యెన్నరాని
దుఃఖమునఁగూర్చుచుండును ద్రోలుచుండి
ఆడుబిడ్డలఁగనుటయే యధమమగును.

ఈవిధమంతయుఁ దిలకింప [ఏ]నికముందాడుబిడ్డ పుట్టినఁ దనుటతోడనే యేచట్టిటనో కలుపుటయే యుత్తమమని పరిణమించునుగాఁబోలును. ఒకపిల్లతోనే సంసారమంతయు నాశనమగుచుండఁ దక్కినవారిగతి యేమగును? కొందఱు బుద్ధిహీనులై యున్నవారికి వేలకొలఁది కట్నము లర్పించి వారికే వంగి వంగి సలాములు చేయుచుందురు. కాని దగ్గర

బంధుగులకిచ్చుట కొడంబడకున్న వారలు. ఆకట్నమే బీదరికంబు నను న్న యేమేనల్లునకో పిల్లసహితంబుగనర్పించి యింటనునిచికొన్న నెంతయో శ్రేయోదాయకమగునుగదా. ఇంతియేకాక, లక్ష్మియే వరించియున్నచోఁ గులశీలనామంబులఁ జూడనగత్యము లేదు. వరుఁడు ధనవంతుఁడైయైనచో.

సీ. కులముతక్కువదైన కొలగానివాఁడైన
ధనముండుటయె మంచి తరుణమిపుడు
విద్యలేకున్నను వెట్టివాఁడైనను
ధనముండుటయె మంచి తరుణమిపుడు
కూళయైననుగాక కుంటివాఁడైనను
ధనముండుటయె మంచి తరుణమిపుడు
సోమరిపోతైన శుంఠయేయైనను
ధనముండుటయె మంచి తరుణమిపుడు
గీ. వరులవెదుకిగ వెడలెడు వారు నేఁడు
చూచుచున్నారు ధనమును జోద్యమయ్యె
కులముశీలమునామంబు కూలిపోయె
జాతిభేదంబులొలుతనే సమసిపోయె.

(అనుచునిష్క్రమించును)

(తెరపడును)

---

(రెండవరంగము)

(వీథిచావడి)

(ప్రవేశము:- వెంకటేశ్వర్లు)

(తెరలో) వెంకటేశ్వర్లుగారూ !

వెం—(వినుటనభినయించి) ఎవ్వరువారు ?

(తెరలో) నేను తపాలాబంట్రోతునండి. పై రొచ్చింది.

వెం.—వస్తున్నాను. వస్తున్నాను.

(అనిపోయి బంట్రోతుసహితముగా ప్రవేశించును)

బం.—ఏమిటండి బాబూ. ఎప్పుడుచూచినా తలుపులు బిగించియే యుంటాయి.

వెం.—తెఱచియుంచితే ముష్టివాళ్ళు ప్రాణాలుతోడికేస్తున్నారు.

బం.—(కాగితము నొకదానినిచ్చుచు) దీనిపై సంతకముచేయుఁడు

వెం.—(అట్లాచరించుచు) నీవింగ్లీషుచదువుకున్నావా నాయనా?

బం.—లేదులేదు. ఇంగ్లీషుచదువుకుంటే యిన్నిపాట్లేమి? ఇదేమి కర్మమో ఏయుద్యోగమూ చేశక్కొందును. నేనుబోయొస్తాను.

వెం.—మంచిది వెళ్లేటప్పుడు దారిలో శ్రీనివాసరావుగారిని రమ్మని చెప్పుదూ.

బం.—అలాగేచెప్పెగనులెండు

(నిష్క్రమించును)

(కొంతవడికి శ్రీనివాసరావు ప్రవేశించును)

వెం.—శ్రీనివాసరావుగారూ! రండి కూర్చుండండి.

శ్రీ.—(ఆసీనుఁడగుచు) ఎందులకుఁ గబురంపినారు?

వెం.—ఈటెలిగ్రామేమిటో చూడండి బాబూ. (అందియిచ్చును.)

శ్రీ.—(చూచి) మెడ్రాసునుండివచ్చినది.

వెం.—(తత్తరముతో) అబ్బాయిదగ్గరనుండియా?

శ్రీ.—అగును.

వెం.—ఈరోజున వచ్చుచున్నానని నాల్గుదినములక్రిందట లేఖనంపి యున్నాఁడే. ఎందులకోవిమర్శించండి. సుస్తీచేసినదా.

శ్రీ.—కాదండి "సెండ్ ఫిఫ్టీరూపీస్" ఏబదిరూపాయిలుపంపించమని.

వెం.—రామరామ ఈడబ్బునుబంపించలేకచచ్చిపోతున్నానండి. పది హేనురోజులకొక యుత్తరంసిద్ధం. ఏజాబులోజూచినా క్షేమ

సమాచారములు కనుపడవు సరేకదా. ఉత్తరంవిప్పేసరికి "యిచ్చట నేను చాలకష్టపడుచున్నాను. వెంటనే తొంబదిరూపాయిలు పంపించవలెను" అనునొకమాటయే ఈయంగ్లీషు చదువులమ్మూలమున కొంపలు గుల్లలౌతున్నాయి బాబూ. అయ్యో! మనవాడెంతయిబ్బంది పడుచున్నవాడోయని అడిగినప్పుడల్లా పంపిస్తే లెక్కలేకుండా యేకాఫీహోటళ్లలో యేసిగరెట్లలో తగులపెట్టడమేకదా. పీడిచదువు తగలబెట్ట. నెలకు రెండువందలు కూడా సరిపోవుటలేదు. పోనీయెంత డబ్బు ఖర్చైనా చదువుచున్నాడేమోయంటే ఒకొక్కక్లాసు నాలుగేళ్ళుకదా. నేనెంతగడగష్టపడి సంపాదించినానో అంతదుర్వ్యయం అయిపోతున్నది. మీరేమి ప్యాసైనారు నాయనా? స్కూలుఫయినలు పూర్తిచేసినారా?

శ్రీ.—ఆల్‌రైట్ ఇంటర్ ఫస్టియర్ కోర్సుకూడా కంప్లీటుచేసినాను.

వెం.—అలాగునటండి. పాపమింతవరకెక్కడ నుద్యోగమే దొరక లేదుకాబోలును. కాలమంతయు మారిపోయినది. ఇప్పటి చదువురీతి యెట్లున్నదంటే

సీ. అప్పుపుట్టినదాక యవసరమంచును
జేబదుళ్లనుదాము చేయుచుండు
పిదపబ్రాంసరినోట్లు విరివిగవ్రాయుచు
వలసినధనమును బడయుచుండు
వడ్డీలుపెరిగిన వాయిదాల్ లిఖయించి
భూములేదనఖాల మొంచుచుండు
క్రియకుదీర్చగలేక క్రియపత్రముల్ వ్రాసి
మడులన్నిపోవగ మిడుకుచుండు

గీ. ఇదియెయింగ్లీషుచదువుల విధమునేఁడు
ఒకనివిద్యకై ధనమంత నోఁడుధకుఁ
జిప్పకట్టిచేతికివచ్చు తప్పదింత
లరయనుద్యోగసంపద యసలెలేదు.

అంతాపల్లకీయెక్కేవారైతే మోసేవారెవరు? ఏపెంటమీఁదనుఁజూచినా బియ్యేలయందాఁటితేరిన మహానుభావులే. ఏమూలనోజూచినా బి.యె. బియల్ హైకోర్టువకీల్సే. చదువంతాపూర్తియగుసరికిగవర్నమెంటువారిచ్చిన పట్టాలను జేతఁబుచ్చుకొని యింటికివచ్చుసరికి తండ్రిగారిఁట్లో దాచియుంచిన నప్పుపట్టాలును జేతులనలంకరించును అప్పుడాతఁడు గవర్నమెంటువారిచ్చినపట్టాను జూచికొని సంతసించునా? తండ్రిగారిచ్చినపట్టానుజూచి దుఃఖించునా? ఈరోజులలోఁ గుటుంబములో నొకఁడు కాలేజీకిఁబోయినాఁడంటే మిగిలినవారంతా యాయవారంముతాలను సంపాదించితీరన్నమాటే చదివేకుఱ్ఱాళ్ళలో మూఁడువంతులు దుర్బలశరీరులేకదా. ఈస్టూడెంట్సులోఁ జాలమంది చిన్నతనమందే తల్లిదండ్రులను విడనాడుటచే భయభక్తులులేక యెప్పుడూ బుగ్గనుకారాకిళ్ళీలు, చేతసిగరెట్లు, ఫీలైన సానివాడలఁ దిరుగుచుఁ బొట్టఁగోసిన నక్షరమేలేక నిరర్థకులగుచున్నారు. ఇంటి దగ్గర తలిదండ్రులు "మాఅబ్బాయి యింగ్లీషుబడిలోఁ జదువుచున్నాఁడని సంతసించుచు, యుత్తరమువ్రాయుటయెతడవుగ లెక్కలేకుండ మనియార్డర్లుచేయుచుందురు. ఎట్టినిరక్షరకుక్షులైనా టౌనులో నుండగనే నెత్తులఁబెడపాపిళ్ళు, వీధులన్నియుఁ దుడుచువారగోచీలు, కాళ్ళకుబూట్సు, కళ్ళకుజోళ్లు చేతబెత్తములు, నోటయెలిఫెంట్ మార్కుసిగరెట్లు, పైగావచ్చియురాని యింగ్లీషుముక్కలు, యివి తప్పవుకదా, ఇఁక రాత్రింబవళ్లనక కాయకష్టములంబడి పరీక్షలయందు తీర్థులైనవారిలోఁ గొందఱింటికే తెంచుసరికి దినుటకుముద్దలేక

సీ. బియ్యేలవారైన పెన్షనుల జెంది
డ్రైవర్ల క్రిందనో డాక్టరులవి
ప్రయివేటుగఁ గష్టపడుటయె యయ్యెగా
నున్నతోద్యోగముల్ సున్నయగుట
ఎఫ్ యేలవారైన నధమమంచును లేక
నాల్గునాలుగులకే నడచుచుండ్రి
స్కూలుఫైనలైన స్కూలుమాష్టరులంచు
ఎలిమెంటరీబడు లెన్నచుండ్రి

గీ. ఇంతయేలను దారకి వింతకాదె
చనుచునున్నార బంట్రోతు లగనేడు
విద్యనేర్చినవారున్న విలువగలుగు
పదవులెచ్చోట లభియించు బ్రతికనెపుడు.

పోనీ విద్యనేర్చినందులకు దగిన తెలివితేటలఁగల్గి యితర దేశస్థులవలె గొత్త పనుల నభ్యసింపఁగలరేమో యంటే యదియును శూన్యమే. బియ్యే. ప్యాసైనా ఎం. ఏ ప్యాసైనా యింగ్లీషుపాండిత్యము లభించుట సున్నయేకాని ఫష్టుఫారంలోనికి వచ్చుసరికే స్వభాషయైన ఆంధ్రభాషకు స్వస్తిచెప్పవలసినదే. అందుచేత నేహూణవిద్యాభ్యాసకు లుక్కుర్చీలపైఁగూర్చుండి కాగితలను వ్రాయుటతక్క యితరపనులఁజేయఁ జాలరు. లభించిన నేదో యుద్యోగము సేయవలయును. శరీరమ్ము రుగ్మతచేఁ గొంతకాలమునకు క్షయరోగివలె శుష్కించి తుదకెందులకును నశక్తులగుచున్నారు. దేశపరిస్థితులిట్లున్నవి. పరభాష నేర్చుట కశక్యము. స్వభాషమఱపు. తుద కుభయభ్రష్టత్వము ఉపరిసన్యాసము. ఈమధ్య యేయెలిమెంటరీపాఠశాలలోఁజూచినా స్కూలుఫైనలునరుకే దిగుమతియగుచున్నది. నాల్గవతరగతియందు దాటితేరిన వారంతా హెడ్మాష్టర్లు, స్కూలుఫైనలువారంతా అసిష్టెంట్లు.

ఏమి— ఫెంటుస్కూళ్లోయిస్తే మీకుచెప్పిమిడికేడూ? అన్నిచదువులు ఇలా గుననే అగోరిస్తున్నాయిలెండి. మీకేతాలూకాబోర్డులోను జీతాలు లేగా?

శ్రీ—లేరుబాబూ లేరు. ఉంటేయున్నారు. ఈపాటికేమేస్కూలు లోనో యుపాధ్యాయపదవిసంపాదించి పదిరూపాయిలు తెచ్చు కోనే తెచ్చుకుందును.

వెం—మనప్రెసిడెంటుగారి దర్శనముచేసినారా?

శ్రీ—ఏమిదర్శనమండి? మునుపు ఆఫీసియల్సుయున్నప్పుడే బాగుం డేది. ఒకప్పుడుకాకపోతే యొకప్పుడైనా దర్శనమయ్యేది. చెప్పుకున్నది వినేవారు. ఇప్పుడున్నవో, యింటికిపోతే ఆఫీసుకు రమ్మంటారు. ఆఫీసుకు పోతే యింటికి రమ్మంటారు. సెకండరీ గ్రేడ్ వాడను, మేష్టరీయిమ్మని యడిగితే లోయ రు హాయ్యరువాళ్లు చాలునని లోయరుహాయ్యరు వాళ్లడిగితే స్కూలుఫయినలువాళ్ళు వేనకువేలుగవచ్చుచుం డ మీకెట్లీయగలమనిన్ని, సమయస్ఫూర్తిగ జవాబులిచ్చు చున్నారు. ఎన్నికాళ్ళుకడుపులు పట్టుకున్నా యీరోజులలో సిపార్సులులేకపోతే చూచేదాతలేడు లేకపోతేప్రెసిడెంటు గారికి విహితులగు మెంబర్లకు చుట్టములైనాకావలెను ఏమి చేయవనాయనా? నన్నాభగవంతుడట్లుచేసినాడుకాడు. ఇవి రెండూతప్పితే డైరెక్టరుగారి కులమైననుగావలెను.

వెం—మీకీయూహయుంటే నాతోనింతవరకెందులకు చెప్పలేదు. ఇప్పుడీటరరలో మీరీపదిహేనురోజులు లక్ష్మణరావుగారితర వున నేజంటుగాదిరగండి. మూడవనిమిషమునకు మీకు కోరినచోట మేష్టరీవేయించడం నాదీపూచీ.

శ్రీ—బాబూ ఇంతకన్న నేమికావలయును? తిరుగ నన్నెప్పుడు దర్శనమ్ము చేయమని సెలవు?

వెం—రెండుమూడు రోజులలో కనుపడండి. ఈలోగా మాట్లాడెదను.

శ్రీ—చిత్తము నాకు సెలవా?

వెం—మంచిది.

(శ్రీనివాసరావు నిష్క్రమించును.)

(తెరపడును)





# పునస్సంధాన శుల్కము

## తృతీయాంకము.

(ప్రవేశము—రుక్మిణి)

ఆహా! ఏనెంతదౌర్భాగ్యదశ ననుభవింపవలసినకాలము ప్రాప్తించెను హా! కాలసర్పమా! నాపాలిటి కభాగ్యదేవతవై యెట్టిదుర్గతులఁ గల్పింపసాహసించుచుంటివి? హా! దైవమా! నాకీపాడుజన్మమేల యొసంగితివి? ఇట్లునిరంతరము దుఃఖాకులస్వాంతనై దిగులందుచు మనియుండుటకన్న, మరణమే శ్రేయోదాయకమ్ముకదా. నాకొఱకు

చం. జనకుఁడుసర్వసంపదల సాహసవృత్తినిబాఱి ద్రోలి యే
దినమునుసౌఖ్యమేకనక దీనతసొక్కుచున్నవాఁడయో
అనయమునప్పువారలఁట యాప్పులచేసడలింపజేయఁగ
తనమదిదుఃఖహర్షములఁ దాల్పఁగఁజాలునెరోగికైవడిన్.

పెఱిఁగి పెద్దదై ఫలాన్వితంబగు వృక్షమును కెఱుచు వేరుపురుగువలెనె నీకుటుంబమును నిర్మూలమొనర్ప బయలువెడలితిని గాఁబోలును. కటకటా! నాకు సుఖము కలలోనివార్తయయ్యెనుగాని, జననీజనకులా!? నామూలమున నిద్రాహారములుమాని, దుఃఖాకులచిత్తులై దివారాత్రములు తపియించుచున్నవారు. తొలుఁత నేనును నాజననియు వలదని యెన్నివిధముల నుడివినను నాజనకుఁడు పెడచెవిఁబెట్టెనే కాని, యించుకయుఁ దలఁదాల్పకుండెను ఇదియిటులుండ

సీ. ప్రాణేశ్వరుని జేరి భజియించుటకుమారు
పాపిష్ఠినై యిట్లు పాయనయ్యె
నీనాథుఁ గొల్చుచు నెగడొందుటకుమారు
దిగులొందుచున్నిట్లు తిరుగనయ్యె
కాంతునితోఁ గూడి కలిసియుంటకుమారు
ఏకాకినై యిట్లు సురిక్కనయ్యె
జీవితేశునిపాద సేవజేయుటకుమారు
ముపమందుఁ జింతతో మసలనయ్యె

గీ. కటకటా! ప్రాణనాథుని కరుణఁ గలిగి
సుఖముగఁ జరియించెడు యోగము లేక
నాథుసన్నిధిలేక యనాథపగిది
బ్రదుకనయ్యెను జేసిన పాపమేమొ.

ఇఁక నాకీభువి నేది శరణ్యము? నన్నిట్లకారణిడుములందఁ జేసిన నా పాపిష్ఠి దైవము నేమనవలయును? (తత్తరపాటుతో) ఆ! ఏమంటిని? సకల చరాచరస్వరూపుఁడై, భక్తపరాధీనుఁడై ధర్మాధర్మవివక్షతలనఱసి యేజీవి యెట్టికర్మము లాచరించెనో దాని ననుసరించి సుఖదుఃఖము లందఁజేయుచు ధర్మస్వరూపుఁడై వర్తించు నామహానుభావుని నిర్హేతుకముగ దూఱఁదొడంగితినే. ఏను—

సీ. ఏదంపతులఁ ద్రోల్లి యెడఁబాపియుంటినో
యెడఁబాయనయ్యె నేఁ డిట్లు విభుని
ఏసతీపతులకు నెట్టికష్టలఁ బెట్టఁ
గష్టజనిపింపఁగఁ గల్గెనో కొ
ఏమహాత్ములను నెగతాళిసేయఁగ
నెగతాళియయ్యెనో యిట్లు నాకు

ఏవిధులంబుల నిషమలందగఁ జేయు
నిషమలసందఁగ నిట్లుకూజ్ఞ
గీ. ఎట్టి యపరాధములఁ గూడ నిచ్చనుంటొ
యెట్టి దుష్పథంబుల కడుగిడితినో కద
కాక, యిట్టివంతలఁజక్క నాకు నగునె
కటకటా! దుర్భరంబగు కాంతబ్రదుకు.

అయ్యో! నా యీతాపాగ్ని యెవ్విధంబున నార్పఁజాలుదాఁ. అయిన నెనిమిది యకరములభూమియుఁ బైగ రెండువేల్వరొక్కము నర్పించినను, నింకను రెండువేలు రావలెననికదా యీబింకములు. వారి నననేల? ఈయపరాధమంతయు నాజనకునిదే. వింప జన్మవి షై పుట్టినింటఁబడి తెహతహలాడు నాఁబోటి యాడుపడుచులకు పురుషసంపర్కము లేకుండఁ జేయువారి కాభగవానుఁ డెట్టిదుర్గతుల గలుగఁజేయునో కదా! అనంతమగు యీవరకట్నముల దురాగత మనుభవింపవలసినవారము మేమా? ఏమి న్యాయము! న్యాయా న్యాయము లడుగంటెనా? ఈపిశాచమును దేశమునుండి తొలఁగించు పుణ్యపురుషులే లేరా? నాబోటి యనాథుల మొరలీలోకమున నరణ్య రోదనములా? పుణ్యపాపములు నశించెనా? నాలో నేననుభవించు చింతలెన్నియైన నిరుగుపొరుగువారి యెత్తిపొడుపులకుఁ దలయెత్తుట కు వీలులేకున్నది కదా!

సీ. వయసువచ్చినవెన్క వసియించుఁ బుట్టింటఁ
బనికిమాలినదంచు పలుకు నొకతె
కాపురంబునులేక కావరంబునఁ దిర్గు
దిక్కుమాలినదంచు తిట్టు నొకతె
ఇట్టట్టుతిట్టాడు యిరుగుపొరుగుఁ జేరు
ధాకాసిలియగు నను రాము దెప్పుకతె

పతివిడనాడినపద్మముఖకదా యీమె
యనుచు హేళన సేయు వనవని నొకతె

గీ. పలుకరాని దుర్భాషలఁ బలుకు నొకతె
లెక్కసేయరు మర్యాద లేనెలేదు
కన్నతల్లియు ద్వేషించు కట్టకడకు
మగని విడనాడి చరియించు మగువకన్న
జుల్కనగ నెద్దియును లేదు చూడఁజూడ.

పతిశుశ్రూషయే సర్వవిధముల భామలకిహపరసాధనమనినమ్మి నవర్తించి జగద్విఖ్యాతిగాంచుహిందూసుందరుల కెట్టిపాట్లు జనించెను ? హా! భరతమాతా ! ఈవరకట్నంబు లనియెడు పిశాచము లావహించి సతీపతుల విడదీసి నీపుత్రికల బాధించుచుండ నెట్లోర్చుచుంటివో కదా!

గీ. పతియె దైవము సతులకుఁ, బ్రణుతులెల్ల
నిష్టకామార్థసిద్ధిని స్వంతు రేని
మదిని నాతనిఁ దలఁచుచు మఱువకుండఁ
జేరి పరిచర్య సేయుటే శ్రేయ మగును.

అను నార్యోక్తిని దలఁదాల్చి తొల్లి యెందఱెందఱు యువతీమణులు యిహపరసుఖంబుల ననుభవింపలేదు. సావిత్రి పతిభక్తి వలననే కదా నిజనాథుని జీవములఁ గాచుకొనఁగల్గెను. నాకట్లు పతినిగొల్చి సౌఖ్యమందుభాగ్యమే లేకపోయెనే.

గీ. పరులయెడ ననహాసముతోఁ బరఁగ నెపుడు
గర్వమున్నదిఁ దలపోయఁ గడఁగనెందు
పతిని మనమున నిడియు భక్తి లేక
మాధవుతి సంచరింపఁగఁ బోల్పలేదు.

## తృతీయాంకము

(ప్రవేశము—విశాలాక్ష్మి, రుక్మిణి)

వి—రుక్మిణీ! యేమే యింతపొగరు! ఎప్పుడును నేకాంతముగనే కూర్చుండి యేదో యాలోచించుచునేయుందువు. ఇప్పుడే యింతపోకిరితనము బలిసిన దేమే! కాపురంచేస్తుంటే, యుద్ధతి పిల్లలను గనేయువాడు. కాటుక లేదు. బొట్టులేదు. మూడుపూటల్లా తినడం. మూలఁ జతికిలబడడం. చిన్నప్పు డెంతబుద్ధిగా నుండేదానవో యిప్పుడంత మొండికెత్తినావు. ఛీ! ఛీ! దరిద్రదేవత యిండఁ జేరి "ఓ" యని యెప్పుడూ పలుకుతూ ఉంటుంది. నీమూలమున అయిన సంసారమంతా దిబ్బైసది.

రు—(కన్నుల నీరునింపుచు) అవునమ్మా! నేను దరిద్రగొట్టుతాలను గాకుంటే యీ గతియేమి! అందరివలెనే నేనును గాపురము నకుఁ బోయియుందును.

వి—మాటమాటకు ధిక్కరించుటకూడ నేర్చినావు. నీకర్మం నీవను భవించవలదా? వెదకివెదకి సంబంధము కుదిర్చి పెండ్లిచేస్తే వాళ్ళకు ధనపిశాచంపట్టి యేడిపిస్తున్నారు. ఉన్నభూమి, డబ్బు పోవడమేకాకుండా పైగా నిరుగు పొరుగువారివలన నిందలు తప్పుటలేదు. ఇంతకు అనుభవించేవాళ్ళ యదృష్ట మునుబట్టి యిటువంటిబుద్ధులుపుట్టుచుండును. ఈసోది యెప్పుడూయున్నదే. నీవు, నేను బ్రతికియున్నంతకాలము నిన్ను జూచి నేను, నన్నుజూచి నీవు యిటు లేడ్చుచుండవలసినదే. అబ్బాయి లేచేను. ఒకసారి ఆడించు. (అని నిష్క్రమించును)

రు—అక్కటా! కన్నతల్లికిని బగద్దాన్నైతినే. ఇంకను నింతటి హేయమగు బ్రదుకేల బ్రదుకవలె!

గీ. గర్భమునఁదాల్చి ప్రేమను గన్నతల్లి
పగనుబట్టినరీతిని విగతదయను
నిందలన్ బుచ్చఁ ద్రోడఁగను నిలువ నగునె
జీవముల వీడుటే యింక శ్రేయమెన్న.

హా! ధనపిశాచమా! నీసాహసమంతయుఁ బతిని విడనాడిన యనాథగదా యనియా స్త్రీయెడఁ జూపమొదలిడితివి. మానవులు మూఢాత్ములై నీనీచపు ప్రవర్తనల నెఱుంగలేక నిరతము నిన్నే సేవించుచు నీరాకనే కోరుచుందురు. సరిగఁ దర్కించిచూచిన నీయం దొక్కటేని సుగుణముకలదా?

ఉ॥ ఆసలఁగొల్పుచుందువహ యంతయు నామయమంచుఁజూపి పే
రాసను నిన్నుఁజేరినను రక్కసికైవడి మాపుమాపఁగన్.
వేసములెన్నియేని యిడ వింతలఁజూపెదు మూఢచిత్తులై
రాసులభంగిఁ గొల్తురయొ తథ్యము నీచము నిన్నెనమ్మటల్.

అగ్నిసాక్షిగాఁ బరిణయమాడి జీవితాంతముదాఁక యొండొరుల యెడ మిక్కుటంబగుప్రేమచే నలరారు సతీపతులకుఁ గయ్యములుఁ గల్పించి వేఱుఁజేయు యవినీతివి నీవేకదా. ఒకగర్భమున జనించి యన్యోన్యానురాగంబునఁ జిరకాలమునుండి కాలమునబుచ్చు సోదరులకు శత్రుత్వముప్పతిలఁజేసి విడఁదీసెడు పాపిష్ఠివి నీవుకాదా? చిన్ననాఁటనుండియుఁ బెంచి పెద్దవారలఁజేయు జననీజనకులను సుతులు తృణప్రాయముగఁ జూచున ట్లొనర్చెడి దుష్టత్వము నీదికాదా? మెల్లమెల్లగ దరిఁజేరి నిరంతరము నిన్నే సేవింతుమని యెంతయో ప్రేమగలదానివలె నటించి తుదకు వడియేటను ముంచినై చునీచపువర్తనురాలవు. నిన్నే నమ్మి చరించు నరులకు—

గీ. శాశ్వతంబగువస్తు వశాశ్వతమని
నీదు సాంగత్యమే మది నిత్యమనియుఁ
దోఁపఁజేతువు సతతంబు దుష్టబుద్ధి
తగునె యవగుణంబుల నిల్పు టధమమగును.

నీవు లేకున్న నీప్రాపంచిక సృష్టియే నిరర్థకమని యెంచి కాఁబోలు నాచతుర్ముఖుఁడు నిన్నిందులకుఁ బంపెను. నోరెఱుంగని బసబాలురు సహితము నిన్నాదరింతురే. నిక్కమ్ముగ నీయంత విశ్వాసఘాతకు లింకొక్క రుండరు.

సీ. గౌరవమని నిన్ను గౌరవింతురె కాని
గౌరవహీనంబె కానవచ్చు
సుఖకారివని నిన్నుఁ జూచుచుందురె కాని
యసుఖమే నీయెడ నవతరించు
స్వర్గమె నీవని చాటుచుందురె కాని
నరకబాధయె యెప్డు నడచుచుండు
కార్యసాధనమని కాచుచుందురె కాని
కార్యహాదివి నీవు కాని కావు

గీ. అర్థమే యన్నిటికిని యనర్థకంబు
యనెడు బుధులవాక్యములను నఱయ కీవు
మిట్టిపడెదవు సతతంబు వట్టిగొడ్డు
కాప్పులెక్కువ యనియెడు మాటనిజము.

అల్లికాకున్న వేలకొలఁది కట్నమర్పించిన నాకు సుఖమొదవునని కదా నాజనకుఁ డట్లొనర్చెను. అందుచేఁ బేరాస మఱింతవృద్ధియై మొదటికే మోసమువచ్చెను. సౌఖ్యమెటులున్నను నీమూలమున గష్టముల కాటపట్టయ్యెను. (ఆలోచన సభినయించి) అయ్యో! ఏ నెంత యవినీతిని. తుంటిఁగొట్టిన పండ్లురాలెనను సామెతరీతి నే

దాల్చి జేసిన పాపపుఁగర్మ నైఋంగక, మూఢచిత్తనై, యొరుల దూ
షించుచుంటటి నైచ్యము. కర్తవ్యమూహించుటయే సుఖదాయకము.

(కన్నుల నీరునింపుచు)

ఇంకను గర్తవ్యమేమికలదు ? అన్నిటికిని నొకటే కర్తవ్యము. ఆత్మ
హత్యయే యిఁక నే నొనర్పఁదగిన విధికృత్యము.

(అని నిష్క్రమించును).

---

రెండవ రంగము.

(ప్రవేశము :—రామచంద్రరావు, నారాయణరావు)

రా—నారాయణా ! చెన్నపురినుండి యెప్పుడు వచ్చినావు ?

నా—మాగ్రామమునకు నెలదినములకుఁబూర్వమే. వచ్చినాను.

రా—నెలదినములకిందట వచ్చినను నొకమా ఱిటకువచ్చుటకుఁ
దీరికకలుగలేదా ?

నా—మామగారూ ! మిమ్ములఁ జూడకుండగ నొక్కగడియయైన
నుండఁగలనా? మీరిట్లు నిష్ఠురములాడుట నెల్లునా? ఎప్పటి
కప్పుడే పయనముకాగా, పెండ్లికి సంబంధములు వచ్చుచున్న
వనియుఁ గొంతకాల మింటనేయుండి పోవలయుననియు, మా
యమ్మ చెప్పుటచే నామెమాటను మీరలేక రాఁజాలనైతిని.
నాజనకుఁడు గతించినదిలగాయతు జనకునిపగిది, విద్యాబుద్ధు
ల నారితేరఁజేసి, పెంచి పెద్దగఁజేసిన మీయుపకారమును
మఱచి నేఁడు కృతఘ్నుఁడ నగుదునా?

రా—సంబంధ మేదైన స్థిరపడినదా ?

నా—మాతల్లి కట్నములకొఱకు కాసించుచున్నది. కాని, నేనందులకు
హర్షించుటలేదు.

రా—ఎందులకు వలదని నీయభిప్రాయము ?

నా——మామగారూ! ఈకట్నములమూలమున జరుగుచున్న దురాగతము లిట్టివి యిన్నియని నుడువుటకు వీలులేకున్నది. మీరీ నడుమ వార్తాపత్రికలఁ జూచుటలేదు కాఁబోలును. కొన్ని కొన్నికుటుంబములు తమకున్న యాస్తులన్నియు విక్రయించుకొని తినుట కన్నమును, కట్ట గుడ్డయును లేక దీనులై పడరాని యిక్కట్లంబడుచున్నారు. కొందరీ లేమి ననుభవింపలేక ప్రాణములనే వదలుచున్నారు. కట్టి ఘోరకృత్యములను గనులారఁ గాంచుచును నెట్లు సిద్ధపడఁగలుగుదును?

గీ. ధనము నార్జింప వే అగు దారిలేదె
 పిల్లనిచ్చెడు వారిఁ బీల్చి వారి
 దుఃఖసాగరమందిడ దూరఁజేయు
 పుట్టినాయ్యంబు తలపోయ హీనవృత్తి.

ఇగియునుగాక, కట్నమును గొనుటతోడనే వారి కమ్ముడై జననీజనకులకుఁ బరలోకక్రియలాచరించుట కధికారము లేకపోవునుగదా.

రా——అగును. నాయనా! అగును. నీపలుకులన్నియు సత్యములే. అయినను గలికాలము. న్యాయన్యాయవిమర్శన లెవ్వరికిఁ గావలెను. అన్యాయమే యీదినములలో ధనార్జనసేయుటకు మూలమైయున్నది. దీనికేమికాని మీయమ్మను జూచి చాల దినములైనది. నీతోఁగూడ నొకసారి తీసికొని రాలేకపోయినావా?

నా——ఎందుచేతనో, యామె యిల్లువిడుట కిష్టపడుటలేదు. నేను రమ్మనమనగా రుక్మిణి కార్యమున్నదికదా. అప్పుడు వచ్చెదనన్నది.

రా——(విచారముతో నిట్టూర్పులఁ బుచ్చి) అయ్యో! అంతటి భాగ్యమా?

నా—(తొందరతో) అదేమి ? సుముహూర్తము నిర్ణయింపబడినట్లు లేఖ వ్రాసితిరికదా.

రా—అలాంటి ముహూర్తములు చాలగడచినవి.

నా—మరల యాటంక మేమి ?

రా—ఆటంకమున కేమున్నది నాయనా ! పెండ్లికాలమందు రెండు వేలు బాకాయిపడినది. ఇప్పు డవి వడ్డీసహితముగా నిచ్చినగాని, కార్యము జేసికొనరాదట. దావాచేసెదమని రిజష్టరీ నోటీసు.

నా—రామ. రామ. ఉన్నదంతా యర్పించినా యింకను పేరాస యేనా ? (ఏదో జ్ఞప్తికి దెచ్చికొని) దావాయంటే జ్ఞాపకము వచ్చినది మీయింటికి దసఖాలువగైరాలున్నను, దమబాకీ తీరేవఱకు యెవరికిని జెల్లకూడదని గెజెట్లో పబ్లిషు చేసినారు. అదెవరో యనుకున్నాను. మీరాసంబంధమున కొసింపుటయే చాల పొరబాటు. అందులనుగురించి యేమి యాలోచించినారు ?

రా—ఒకటే యాలోచన. వారికివ్వగా మిగిలినది రెండుయకరాలు. దాఖిప్పై దెచ్చిన ఋణము రెండువేలు. వడ్డీతోగలిసి యీ నరికే సెట్టింపగును. ఉద్యోగమువల్ల వచ్చే సొమ్ము పొట్టకూటికే చాలదు. ఇంటిని విక్రయించి సొమ్ము నీయవలసినదని వారికోరిక. రుక్మిణికి నిద్రలేదు. హారము లేదు. ఆమె యింట చెంగతోనుండ మాకు పరితపముక్కడిది ? కృష్ణవేణికిని పెండ్లి యీడు వచ్చినది. ఏమి సేయుటకును దోచకున్నయది.

(తెరలో)

రామచంద్రరావుగారూ ! రామచంద్రరావుగారూ !

నా—ఎవ్వరో మిమ్ములనే కాబోలును బిల్చుచున్నవారు.

రా—ఎవ్వరు వారు?

(తెరలో)

కోర్టుజవానునండి.

రా—లోనికి రమ్ము.

(కోర్టు బంట్రౌతు ప్రవేశించును).

బం—రామచంద్రరావుగా రెవ్వరండి?

రా—నేనే. ఏమది?

బం—సమను వచ్చినది. (అని యొక కాగితము నొసంగును).

రా—(గ్రహించి యామూలాగ్రముగఁ జదివి) చెప్పినట్లంతయును జేసినారు.

నా—వియ్యాలవారు దావాచేసినారా?

రా—ఆ. అదే నోటీసు.

నా—ఎంతకు?

రా—అసలు రెండువేలు. వడ్డీ అయిదువందల యేబది.

నా—నారాయణా. ఎట్టిఘోరములు జరుగుచున్నవి!

బం—నాకుఁ బ్రొద్దుపోవుచున్నది. వ్రాలుచేసి యివ్వండి.

నా—సమాను తిప్పివేయుఁడు. తరువాత చూచుకొనవచ్చును.

బం—అదెట్లు? వీలులేదు.

నా—నీవిషయమై చెప్పుతాముకదా.

బం—(ఊరకుండును).

రా—ఎప్పటికైనా తప్పునా? కావున నిప్పుడే పుచ్చుకొనెదను. (అని వ్రాలుచేసి యిచ్చును).

(బంట్రౌతు నిష్క్రమించును).

నా—ఈ కేసులో న్యాయవాదిని నియమించి ప్రతివాద మొనర్చుటయే ముఖ్యకర్తవ్యము. లేకున్న నాలుగువేల కిమ్మత్తుగల్గిన

యింటిని వేలము వేయించును.

రా—ఇంకను దీనికిఁ బ్రతివాదముకూడ గావలయునా ? అయినను నాలోచింతము.

నా—ఈదినములలో దేనికిఁ దగినట్లు దానికి తాళము వేయవలెను. సాధారణముగ నీకాలమున నప్పిచ్చినవాడు వడ్డీలకు వడ్డీలు పెంచి, ఉన్న యాస్తినంతయు వేసికొనఁ జూతురు. ఇఁక బదులు పుచ్చుకొన్నవారన్ననో బదులుపుచ్చుకొని యావలకేఁబు దెంచినది లగాయతు యేరీతి దాని నీయకుండఁ దప్పించుకొన వచ్చునని యాలోచించుచునే యుందురు. ఉభయులు మోసమునకే యత్నించుచుందురు. తుదకు వీరిలో నెవరికిఁ గుదుఱక కోర్టులకుఁబోయిన, ముందుగఁ ప్లీడర్లకిందను, పిదపఁ గోర్టుల కర్చులకిందను, నున్నసొమ్మంతయు నోడి, యిద్దఱకునుగూడఁ దగిన బ్రాయశ్చిత్తమై, దావా సొమ్మునకు నాలుగురెట్లు హెచ్చుగఁ బోయి నెత్తులు గోకికొనుచు గెల్చినవాఁడు యింటిలోను, నోడినవాఁడు బయటను నేడ్చుచుందురు. వీరికి దగినట్టి ప్లీడర్లను గాచుకొనియుండి...

సీ॥ వాదియైనను బతివాదియైనను జేర
రారమ్మటంచును రగులఁగొల్పి
సత్యమేయైన న సత్యమేయైనను
భయమేల యని పరిగ ల్బములవల్కి
చేరినవెనుకను పోరు సల్పుచువెంట
ధనమంతయునులాగ దారి వెదకు
రేపంచు మాపంచు చూపించి వాయిదాల్
వత్సరంబుల నెన్నొ వరుస గడపు

గీ॥ తుదకు గెల్చిన దనశక్తిఁ దోపఁజేయు
ఓడినన్ వీడకుండఁగ నోర్పుతోడ
బోధనల్సల్పి పైకిని బోవఁజేసి
అంతముగుదాఁక వదలక యాటసల్పు॥

ఇంతయేల? కోర్టులకుఁబోయిన సాధారణముగా వాది ప్రతివాదులు సజీవులైయుండఁగఁ దేలుననుట సన్వీకల్ల. ఆవకీల్సు సత్య మసత్యముగాను, అబద్ధము నిజముగాను, జోర్లించి న్యాయమూర్తులను మభ్యపెర్చి తలకిందులుగ మార్చివేయుదురు. ఈకోర్టు లాలోకమాదిరి కాదు. ఆసమయమునకు కేసుకుఁదగినట్లుగా పైకోర్టుతీర్పులనో ముందవేసి, దాని స్వభావము, దీని స్వభావము యొకటియే యని బొంకుచుందురు. ధనవ్యయమునకు ముఖ్యసాధన మీకోర్టులే. పోలెడుబియ్యము పోదికిఁబోతే కుంచెడుబియ్యము కుక్కయెత్తుకపోయెనను సామెతరీతి, నిజమని సొమ్ముఁ రాఁబట్టుకొనుటకుఁ గోర్టులకుఁబోతే దానికి రెండింతలో, మూడింతలో ఖర్చుతోఁ దేలును. పూర్వ మిన్నికోర్టులు కలవా? ఇప్పుడున్ననో యేపల్లెటూరునందున జూచినా కోర్టే. అసగా పూర్వము కలహములుపుట్టినను ప్రజలు తమ గ్రామములోనే తగుమనుష్యులను మధ్యవర్తులుగఁ గోరుకొని తగవులు తీర్చుకొనుచుండెడివారు. ఇప్పుడెవరికి వారే స్వతంత్రులు. పెద్దలేదు. పిన్నలేదు ధనమనిన లక్ష్యములేదు. పదిరూకలకో దావా దాఖలగునని పోవును. తుదకుఁ బదివందలుకూడా సరిపోవు. ఏది యెటులున్నను, నిందులో వాదముసేయుట తప్పదు.

రా.—సలహా చేయుదము. ఈవిషయ మిటులుండఁ గృష్ణవేణికిఁ బండ్రెండవయేడు కూడా గడువనున్నది. ఏమియును దోచుటలేదు. త్రోలుతఁ గళ్లుకానక

గీ॥ హితముఁ జెప్పెడువారల హితులపగిది
తోఁచి రప్పా డనుభవములఁ దోఁపఁజేసె
నిక్కమిదియంచు అక్కటా! నెనరులేదు
ధనము నశియించె పాల్లును దప్పవయ్యె॥

నారాయణా! చుట్టమవైనను, మిత్రుఁడవైనను నీవే. అజ్ఞానముచేఁ జేసిన యపరాధముల లెక్కింపక, కృష్ణవేణిని...

నా—మామగారూ! మీరింతగఁ జెప్పవలెనా? మాయమ్మతోఁ జెప్పి వర్తమానమంపించెదను.

రా—నీవాడంబడిన నామె వెనుదీయునా? కావలసినవాళ్ళము. మంచిచెడ్డల నాలోచించుము. బుద్ధిజాడ్యంబున నీయట్టి సుగుణవంతుఁ డింటనుండ, నీయత్త యెన్నివిధములఁ జెప్పినను "దూరపుకొండలు నునుపన్నట్లు పెఱటిదారిని బోయితిని. నీవీ మహోపకారమును జేసి నామనమునంగలచింత కొంత వఱకు శాంతించును.

నా—సాధ్యమైనంతవరకు లేఁగలే యొనర్చెదను.

దా—భోజనమునకు వేళయైనది. పోవుదము రమ్మా. అటుగ మఱచితిని. పట్టపరీక్షయందు తీర్ణుఁడవై తివఁట కాదా? ఉద్యోగపుఁబ్రయత్న మేమైన సేయుచున్నావా?

నా—అగును. యత్నమొనర్చుచున్నాను.

(ఇరువురును నిష్క్రమింతురు).

(తెర పడును)






## చతుర్థాంకము.

(ప్రదేశము :—అనంతరావుగారి కచ్చేరిచావడి)

(ప్రవేశము :—అనంతరావు కుర్చీలోఁ బండుకొనియుండును.)

అ—అబ్బబ్బా ! ఈప్లీడరీవృత్తిలో అంతా డబ్బే అంటారు కాని,
కన్నుబొడుచుకున్నా కాని కనుపించదు. ఈరోజులలో డం
భాచారమునుబట్టి డబ్బు లాగవలసినదే కాని, యెంతచదువుఁ
జదివినా బురదలోఁబోసిన పన్నీరే. ఇంటింటి కొక్కప్లీడ
రుంటుంటే అందఱికిని కేసులెక్కడనుండి వచ్చును. అక్కడకీ
పదిరూపాయిలు ఫీజురావలసిన కేసుకు పదిడబ్బులుమాత్రం
పుచ్చుకుంటానన్నప్పటికి యెవ్వరూ కన్పట్టరు. పట్టావచ్చి
పదేండ్లయినది. ఈచదువుకు తెచ్చిన బదులుకు వడ్డీనైన
యివ్వలేకున్నాను. పోనీ యీతాలూకాబోర్డు ప్రెశిడెంటు
షిప్పైనా శాశ్వతముగానుంటే కొంతడబ్బును బ్రోగుసేయ
వచ్చుననుకుంటే యీ టరంతో నదియు నిల్చునట్లు తోఁచదు.
దానికిని ఓట్లసిష్టం. ఎట్టినిరక్షరకుక్షులైనా పదిమంది వలు
కుబడియుంటే పదవి అరచేతిలోనిదే. వాఁడు తినలేఁ డొకఁ
డికి పెట్టలేఁడు. ఈవృత్తులకన్న వ్యాయపారమే మేలని తో
స్తుంది. డబ్బు లేకపోయినా డంభాచారములు తప్పవు.

కోర్టుకుఁ గాలినడకను బోత యవమానము. బండిమీఁద బోవుటకు పాడరిలేదు. ముందునకుఁ బోయిన నుయ్యి. వెనుకకుఁ బోయిన గొయ్యి. ఏయితరయుద్యోగములు లేక ప్రతివారు బి. యే. కాగానే లా కాలేజిలు తడుముకొనుచున్నారు. ఊరకే కూర్చుండిన ఉపన్యాసమైన ఇచ్చేవారు లేరు.

(తెరవంకఁ జూచి)

అదిగో! యెవ్వరో వచ్చుచున్నారు. ఎవ్వరో యననేల! మన వెట్టివెంకటేశ్వర్లే. వీఁడు డబ్బు వదలలేఁడు. పనులు మాత్రము జరుగవలెను. ఈలాటివాళ్ళనే మాయలో ముంచి, యెట్లో ధనమును గ్రమక్రమముగా లాగవలయును.

సీ. ఇచ్చిన లేకున్న తెచ్చినఁ దేకున్న
రండంచు మర్యాద యుండవలయు
నీటుగోటులఁజూపి నిర్లక్ష్యభావంబుఁ
గోపఁజేయుచు నుండుఁ దొలుతవిద్య
విత్తంబు హెచ్చని వెనుకంజవేసిన
మధ్యవర్గులఁబెట్టి మాన్పవలయు
వచ్చి చేరినదాది పలుకరించుటమాని
ధనముతోఁ బనియని తలఁపవలయు

గీ. చనవుఁగల్గించి పిదపను సానిపగిది
వెనుకవెనుకకుఁ దగ్గుచు వేలకొలఁది
ధనము లాగంగఁజూచుటే తగినవిధము
పడుపువృత్తియే మేలయ్యె పట్టిచూడ.

(ప్రవేశము :—వెంకటేశ్వర్లు)

అ—ఓహో సాహుకారుగారు దయచేసినారే. రండు. దయసేయుఁడు. (అని యొకకుర్చీని జూపును).

వెం—(కూర్చుండి) ఏమి స్వాహాకార్లండి. కాకితాలుచూచుకుని సం తోషించేరోజులు వచ్చినవి. బదులు పుచ్చుకునేటప్పుడు తన బాబుగారి సొమ్మని పట్టుకువెళ్లడం. ఇచ్చేటప్పుడు కన్నుల నీరుఁ బెట్టడం ప్రతీవాళ్లకు అలవాటైనది.

అ—ఏమది? ఎవ్వరైనా బాకీ యివ్వమని తిరస్కరించినారా? తిర స్కరించినంతమాత్రమున నేమగును?

వెం—ఒక రన్నమాటేమిటిబాబూ. అంతా అదేమాదిరి.

అ—నాకు అర్జంటుపనియున్నది. ఏదైనా ప్లయింటు వ్రాయవలెనా?

వెం—(తనలో) నీకెప్పుడూ అర్జంటే. గోళ్లుకొరుక్కుంటూ కూర్చుం డడమేకదూ. అన్నీ లంజవేషాలు. లంజటక్కులు.

(ప్రకాశముగా)

(కాగిత మొకదానినిదీసి) ఇదిగో! దీని నామూలాగ్రముగఁ జిత్తగించండి. (అని యిచ్చును).

అ—(చదివి) ఈ సొమ్మిమ్మాయ లేదు.

వెం—ఇవ్వడమా. జవాబుయిస్తే సొమ్మిచ్చినంత ఫలితం. తుదకు నోటీసు యిచ్చినా ప్రత్యుత్తరము లేదు.

అ—ఈయన మీవియ్యంకులేకదా.

వెం—కనుకనే యింతపొత్తు.

అ—ఇవ్వకన్నారా?

వెం—ఉన్న సంగతి మనవిచేసుకున్నానుగదా.

అ—ఆశ్చర్యము. ఈమధ్య అన్నీ యీలాటి దావాలే. ఈబదులు పెండ్లికిఁ బూర్వమా? పిమ్మటనా?

వెం—పూర్వమే.

అ—వీరు కట్నమెంత యిచ్చినారు?

వెం—పుట్టెడు భూమి. రెండువేలు రొక్కము.

అ—నాలుగువేలు కాదా?

వెం—తక్కిన రెండువేలు యివే.

అ—అదాకథ. పోనీ వియ్యంకుడుకదా. అంతమాత్రమునకు దావా చేసి సొమ్ము రాఁబట్టుకోవలయునా?

వెం—మీరు చెప్పినది బాగానేయున్నది. వియ్యంకుఁడని యింకొకవెయ్యి యెక్కువీయరాదా ?

అ—మీతో నాకు వాదమెందులకు ? ప్లెంటిప్పుడే వ్రాసెదను.

(అని లేవఁబోవును.)

వెం—వ్రాయవచ్చును. ముందుగ నోటీసింకొక టీయవలదా?

అ—నోటీసువలన నేమిప్రయోజనము ? వేడినీళ్లచే యిండ్లుకాలునా? ఇదియొక కాలయాపనగాని యందువలన లాభములేదు. ప్లయింటు దాఖలై సమనులు వెళ్లేసరికి మనసొమ్ము వడ్డీ సహితముగా వచ్చును.

వెం—ఫీజుమాట ఏమిటి?

అ—(నవ్వును నటించి) ఫీజా ! ఫీజుమాటకేమిలెండి. మీరెఱుఁగరా మీదావా నెగ్గుటయే మాకుఁ బ్రధాన్యముకాని మీవంటి వారియొద్ద సామాన్యులకువలె నొక్కి వక్కాణించ నోరాడునా ? (కాగిత మిటునటుఁద్రిప్పి ఆలోచన నభినయించి) ఇందులో వాదముచేయుట చాలకష్టము. ఏమందురా? కట్నము కొఱ కీయవలసిన సొమ్మని ప్రతివాది ఋజువుచేసేయెడల చాల గందరగోళమగును. మనశాస్త్రములలో నెక్కడవెదకి చూచినా యీవరశుల్కములవిషయమై కన్పట్టదు.

వెం—అయితే గెల్చుట యనుమానమేనా?

అ—నాచేతిలోఁబడ్డ సూటేదియు నింతవఱ కెన్నఁడు పోయినదనిన వారు లేరు. దీనియబ్బకేసులు నెగ్గించినాను. మామూలుక్లిష్ట

ర్లు తక్కువఫీజు కోస్తారని చాలమంది యిక్కడకుఁ బో-
యెదరు. కాని, ఓలి తక్కువని గుడ్డిదానిని పెండ్లియాడితే
కుండలన్నియుఁ బోఁగొట్టును. సామర్థ్యత గ్రహించవలెను.
అవన్నియు మనకెందులకు ? ఫీజుమాత్రము కొంచెము...

వెం—ఇందులో నేమున్నదండి ? వా రెన్నివాదించినా నోటుబాకీ
యేకదా.

అ—వెంకశాశ్వర్లుగారూ ! పోనీ యీ కేసులో నేను బ్రతివాది తర
ఫుననుండి వాదించి నిమిషములమీద డిస్మిస్ చేయించనా ?

వెం—బాబూ! ఇంకొకచోటకుఁ బోయేయెడల నిచ్చుటకు తావడ
మెందులకు ? మాయింటిప్రక్కనున్న ధరణీప్రగడ రామా
రావుగారి నెఱుఁగుదురుగదా.

అ—నిజమే. ఆయనకిచ్చిన బాగుండునే. కేసు దాఖలుకాకుండగనే
డిస్మిస్ అగును. నేను మొదటనే చెప్పలేదా? అంటిజని ఓడీ
ఒడిపోయకుండా యిక్కడకు వచ్చినారా? నేను జెప్పెడిదా
నిలో నొకటైనా యబద్ధముంటే నేనిందులో దమ్మిడీపుచ్చు
కోకుండా యుచితముగానే పనిచేసెదను.

వెం—అయితే తమయభిప్రాయమేమి ?

అ—మాకీయవలెనని ముఖ్యముగా యుద్దేశ్యమే లేనప్పు డభిప్రా
యమెందులకు ?

వెం—అభిప్రాయమే లేకుంటే యిక్కడకు రానేల ? ఒక వందరూ
పాయిలు యిచ్చుకుంటాను. పనిచేయించండి. మనపక్షమైతే
తరువాత మీరున్నారు. నే నున్నాను. ఈదావా నెగ్గినదంటే
యింక మీదగ్గరకే వచ్చుచుందును. తెల్లవాటి లేస్తే బోల్డు
ధావాలు. మీ కెఱుఁగని దేమున్నది ?

అ.—(విసుగుదలతో) ఏమిటయ్యా ! ఏదో పెద్దమనుష్యులు, సావుకార్లుకదా యని, మాట్లాడుతుంటే వంకాయలబేరమా ? నిలువని కేసు నిలుపడం మాటలా ? రెండుకు తక్కువయైన మాట్లాడ నగత్యములేదు.

వెం.—అయ్యా ! అటులే చేయవచ్చును. మరల వచ్చెదను.

అ.—మీాయభిప్రాయమేమి ?

వెం.—మరల వచ్చెదనులెండి. (అని యీావలకుఁ జనును).

అ.—అయ్యో ! వచ్చినవానిని బోఁగొట్టితినే.

(ఆతురతతో)

దామోదరా ! దామోదరా ! (అని కేకలిడును).

(ప్రవేశము—దామోదరుఁడు)

దా.—(తనలో) ఏదో కొంపమునిఁగినది కాఁబోలును. పని యున్నా లేకున్నా యీాదుర్గాయే. నాకుఁగూడి లాభించేదిలాగే తోస్తుంది. (ప్రకాశముగా) బాబూ ! ఏమిసెలవు ?

అ.—ఇప్పు డొకపార్టీవచ్చి, ఫీజుదగ్గర కుదురక వెళ్ళుచున్నాఁడు. ఆయన వంద యిస్తానన్నాఁడు. నేను రెండువంద లిమ్మన్నాను. ఏదోమోస్తరుగాఁ దీసికొని రమ్ము.

దా.—మీాతో నింతకుముందు మాట్లాడుచున్న బ్రాహ్మణుఁడేనా ?

అ.—అగును.

దా.—అయితే నావల్లకాదు. ఆవరదకైనా యెట్లొడంబడినాడోకాని, పిల్లికి బిచ్చముపెట్టని మహాదాత. ఇప్పుడే నేను బోయిన మీారే పంపించినారని గ్రహించి యేబదిరూపాయిలకే కావలయు ననును.

అ.—వెళ్లి రమ్ము. ఆలస్యమైన నాతఁడు వెళ్ళిపోవును. కొంతదూరము పోనిచ్చి కలిసికొనుము.

దా—నామాట...

అ—నీవందులోఁ బడి తినవచ్చునులే.

దా—ఇంతా కష్టపడితే పదిరూకలా? నాకక్కఱలేదు.

అ—నీయభిప్రాయమేమి?

దా—రెట్టింపు.

అ—నిన్నడవలసిన పనియేమి? మావృత్తి యంతనీచమైనది. సరే వెళ్లి రమ్మని.

దా—చిత్తము. (అని యీవలకువచ్చి)

దా—అందితే జుట్టు. అందకపోతే కాళ్ళు. పార్టీలు దగ్గరకు రాఁగానే హోదాలు చూపించి మాట్లాడుటే గౌరవహీనంబని తలతురు. వారును వీధిలోనికి దారితీయగనే, మమ్మేలను, మమ్మేలను బంపి కాళ్ళుపట్టుమనడం. "ఆవు, దూడయుండ నఱుమగుంజాగ్నె" నన్నట్లు పార్టీలు ప్లీడర్లు యుండగా మధ్య మాకా. అన్నప్రకారము నిల్చుటకుఁ దగినంత రాబడి యుంటే యిబ్బందిలేదు. ఏమిఁగినవాఁ డెవ్వఁడు రానేరాడు. ఈలాటి లోభి యెవ్వఁగో రాకరాక వస్తే వచ్చినంతమట్టునకు రాఁబట్టుకోక తెగనీల్గు. అప్పుడు వంకాయలబేరమా అనడం. ఇదిమాత్రం వంకాయలబేరం కాదా. ఇంతకన్న పదే మేలు. ఎంత చచ్చినా పులుసు చావదు. మేము బి. యె. బియల్ ప్యాసైనాముకదా యని కోట్లు తగిలించుకుని, కోర్టులకు వెళ్ళగానే డబ్బు వస్తుందా. ఇంత యక్రివృత్తి మఱొక్కటి కానరాదు. పార్టీదగ్గరకుఁ జేరి వకాల్తునామా యిచ్చినాఁడంటే యిల్లు గుల్లచేసికొన్నాఁడన్నమాటే. పాప మీగవర్నమెంటువారు ఫీజు లేర్పాటుఁ జేసినారు. ఏకేసైనా సరే ఎన్నివందలిచ్చెద వనే బేరం. అం

దువలననే యన్యాయార్జితములు నిలుచునా? వారి విషయ మట్లుండ ఖే నీమాదిరిగా నొక్కొక్కనాఁడు పది, యిరవై, న్నూ ఫై సంపాదించినాను. మఱునాటికి మరల అయ్యవార్లుం గారి నట్టిల్లే. ఇదంతా నాకెందులకు? వాళ్లకర్మం వాళ్లది, నాకర్మం నాదీ. నాసొమ్ము నేను రాఁబట్టుకుంటాను. (అను చుఁ బోవును).

(ప్రదేశము—రాజబాట)

దా—ఏమయ్యో! మాట మాట.

(తెరలో) ఎవ్వరు వారు నాయనా. నాకు భోజనమునకు వేళ య్యెవది: పోవలెను.

దా—ఆగండి. ఆగండి. వస్తున్నాను.

(అని పోబోవును.)

(తెర యెత్తఁబడును.)

దా—ఓహో! పంతులుగారే. ఎవ్వరో యనుకున్నాను. ఎప్పుడూ రానివారు యీవేళ యీలాగు దయచేసినారేమి?

వెం—ఈకుశలప్రశ్నలకా నన్ను బిలిచినది?

దా—బాబూ! కాదండి. ప్లీడరుగారిగృహమునుండి వచ్చుచున్నా రేమో యని...

వెం—అయితే యేమి?

గా—నన్ను మీకెఱుఁగరు కాని మిమ్ముల నే నెఱుఁగుదును. మీ యింటివద్ద బ్రాహ్మణార్థము చాలాసారులు చేసినాను. అందు వలన నే నీవీధినుండి వచ్చుచు, అనంతరావుగారి యింటినుండి బేరం కుదుఱక కాగితపుకట్టఁ జంకనుబెట్టినట్లు తోఁచినది.

వెం—అవును! ఆయన కంగుడులేదు. కొంపలన్నీ దోచుకోవాలనే వారి యభిప్రాయము.

దా—దానికేమిలెండు. ఎవరికి వారికే యీయభిప్రాయముంటుంది. మీరు వడ్డీలుపెంచి కొంపలు వేసుకుందామని చూడరా?

వెం—(కోపము నభినయించి పోఁబోవును.)

దా—కోపము మానకుఁడు. చలోక్తికన్నాను. మీరన్నమాట సత్యమే. కాని, అసలు బేరమేమిటి?

వెం—ఏమియున్నది? రెండువేలరూపాయిల నోటుబాకీకి రెండువందలు ఫీజు కావలయునఁట.

దా—మీరు పెద్దలు. కోపమువస్తే చెప్పలేనుకాని, పెద్దలు సంపాదించిన కొండొకొంతైనా యుంటే యీచదువులకుఁ తగులబెట్టి, కాయకష్టములఁబడి చదువుకున్నారుకదా. మీకుఁ దెలియని దేమున్నది? ఏదో విధంగా పొట్టపోసికోవలెనా? లేదా? చెప్పండి. మీకేమి? మీరు జమీన్‌దారులు. మీలాటి యాస్తులుంటే వారును మీవలెనే కూర్చుందురు. మీ రేమన్నారు?

వెం—ఒక వందరూపాయి లిస్తానన్నాను.

దా—అబ్బో! మీకు వారికి చాలా తేడాయున్నదే. నే నొక్క మాట చెప్తాను. వింటారా?

వెం—ఏమిటది?

దా—ఈకోర్టులోనున్న ప్లీడర్లందరిలోను కొంచెము నోరెత్తి మాట్లాడఁగలవాఁడీయనే. ఈయన కోర్టులో బల్లగుద్దడ మెప్పుడు చూడలేదా? మునసబుగారు వీరి కేకలకు హడలి యెన్ని కేసు లీయనపక్షము చేసినారు. మీరేదో తెలిసినవారని చెప్పవలసివచ్చినది కాని, నిజముగా నీయన కిది యొక లెక్కయా? చాలమంది మీవలెనే తిరిగిపోతూ ఉంటారు. ఏదో తునితగవు చేసికొందాము రండి. మనకు కేసు

నిగ్రహం. పారిశామ్యముకాని, వందరూపాయిలూ మాకు దక్కిం చునా? ఇప్పు డీఫీజు యెక్కువని తెలివితక్కువక్షీదర్ని పెట్టి తే మొదటికే మోసంకల్గుతుంది. హైకోర్టులకుఁబోయి తిరిగి బాధపడవలెను.

వెం—నిగ్రహించుట యనేమి భగవంతుఁడా?

దా—అదియూ మీరు చెప్పేది. ప్రాణమేవిధమునవైనను బోకుండ నాఁగదనిచెప్పి మందులు వేయనక్కఱలేదా? మనశక్తికొలఁది మనము పాటుబడి పిదప దైవముమీఁద భారమువేయ వలెను. ఓరుగాలిలో దీపముపెట్టి భగవంతుఁడా నీమహిమ యనడమా?

వెం—ఆయనవాద మెట్లున్నా, మీవాదమెక్కుడుగా నున్నది. అయితే మీయుద్దేశ్య మేమిటి?

దా—మీరన్నదీ కాదు. ఆయన చెప్పినదీ కాదు ఇద్దరికిఁగల తేడాలో సగము.

వెం—అబ్బా! నూటయేఁబది రూపాయలే. దావాపోయినాసరే కాని, నేనంతసొమ్ము నియ్యను.

దా—అయితే వెళ్లండి.

వెం—(పోవుచుండును.)

దా—మాట మాట ఇంకొక పాతిక కట్టుకోండి.

వెం—పాతిక లేదు. పరకాలేదు, నన్ను పోనివ్వండి.

దా—రండి వెళ్లుదాము.

వెం—మీ కాయనతోఁ బరిచయమున్నదా?

దా—మీకెంత పరిచయమున్నదో నాకును నంతే కలదు.

వెం—అయితే యాగొడవ మీకెందులకు?

దా—మీ మేలుకొరకే.

వెం—నమస్కారము.

(దామోదరుఁడు దారితీయును.)

వెం—ఈపిల్లమంతా నాకొడుకే కాఁబోలును. ఈలాటిరాజమ్మలు నెంతమందిని జూచినానుకాను. నాకు వీఁడుతగవరా? వాఁడి డబ్బుకోసం వాఁడు ఏదో యిందులోవి పదిరూపాయిలు యిస్తానన్నాఁడు కాఁబోలును.

దా—ఆగినారే. రండి.

వెం—నాయనా! ముసలివాఁడను. వస్తున్నా—

(అని యిరువురును నిష్క్రమింతురు.)

---

రెండవ రంగము.

---

(ప్రవేశము - అనంతరావు).

అ—తుద కాబ్రాహ్మణుఁడు వచ్చునో, రాకుండునో, దురాశదుఃఖ మునకుఁ జేటను బుధులవాక్యము లనృతములగునా?

గీ. తొలుత దతిఁజేర వారిని దూలనాడి
పోవ, నోర్చక వెనుకను బోరిపోరి
ధనము లాగంగఁజూచెడు దారికన్న
హీనమగు దెద్దియునులేదు యిలను జూడ,

ఎన్ని యకార్యములొనర్చినను, నెన్ని నిందలకుఁ దలయొగ్గినను యీధనవ్యామోహము వలనస్తేకదా.

(ప్రవేశము - దామోదరుఁడు)

అ—పంతా! కాయ్యా!

దా—పండే. కాని, నేను మొదటఁ జెప్పలేదు బాబూ. చంపుకు తిన్నాఁడు. మీదర్శనమున కెవ్వరో వచ్చినారు ?

అ—ఎవ్వరు? లోపలకు రమ్మను.

(దామోదరుఁడు నిష్క్రమించును.)

(ప్రవేశము - శ్రీరాములు.)

శ్రీ—(నమస్కార మొనరించును.)

అ—(అందుకొని) ఏగ్రామము మీది ?

శ్రీ—అయ్యా! మాది ఆర్యాపురము. నాపేరు శ్రీరాములందురు.

అ—పనియేమి ?

శ్రీ—తమదర్శనమునకే వచ్చినాను.

అ—ఎందుకయ్యా !

శ్రీ—స్కూలుఫయినలు ప్యాసైనాను. ఆంధ్రభాషయందును గొంచెము ప్రావీణ్యము కలదు. తమబోర్డులో ననేకమందికి యుపాధులు కల్పించుచున్నారు. నాకుఁగూడ నెక్కడనైనా స్కూలుమాష్టరుపోష్టు యిప్పించవలసినదని నాకోరిక.

అ—ప్రస్తుత మెచ్చటను ఖాళీలు కనుపింపవు. బోర్డులో నిదివరకు పనిచేసినవారికే పోస్టులు దొరుకుటలేదు. ఇదిగాక మాకు స్కూలుఫైనలువారగత్యములేదు. ముందెప్పుడైన ఖాళీలు న్నప్పుడు చూచెదను.

శ్రీ—అయ్యా ! ఇదివరలో ననేకసార్లు తమ దర్శనమునకుఁ వచ్చినాను. వచ్చినపుడెల్ల మరలరమ్మనుచుండిరి. ఇప్పుడు ఆ శ్రీయుపురంలో రెండవ అసిష్టంటు సెలవుపెట్టినాఁడు. ఆపోష్టు దయచేయించగలందులకుఁ గోరుతాను.

అ—ఆపోష్టు యిదివరకే యొకరికి ప్రామిస్ చేసినాను.

శ్రీ—అయ్యా! తన్ను దానుబాగుచేసుకొనుట నింద యేకాని, యెలిమెంటరీ పాఠశాలలోఁ గొంతకాలము పనిచేసి, విద్యాభివృద్ధికిఁ దోడ్పడవలయునని కోరికతో వచ్చినాను.

అ—ఉండిన నుండవచ్చును. అందులకు మేమేమి చేయఁగలము? వెళ్లండి. వెళ్లండి.

శ్రీ—అయ్యా! బీదవాఁడిని.

అ—(విసుగుదలతో) ఏమిటయ్యా. అంతాబీదవాళ్ళే. అంతా తెలివైనవాళ్ళే. మాకు తెలివితేటలతోను, బీదతనముతోను నిమిత్తంలేదు. పిశాచంలాగ పట్టుకున్నావేమిటి! నీవెంత సేపున్నా లాభంలేదు. వెళ్లు. వెళ్లు.

శ్రీ—మీరు అధికారులు. యేమన్నా తగును. అధికారమదసంబున నెల్లరకును గనులు కానరావు.

(అని నిష్క్రమించును.)

అ—అకార్యముల కొడిగట్టిన నెదుటఁ దిట్టుచున్నను నోరెత్త వీలులేకుండును. ఎదుటఁ దిట్టువారు కొందఱు, దూరముగనుండి తిట్టువారు కొందఱు.

(ప్రవేశము - రామారావు)

రా—అయ్యా! నమస్కారము.

అ—(అందుకొనుచు) ఈనమస్కారములు పుచ్చుకోలేక చచ్చిపోతున్నాము. ఏయూరు?

రా—అయ్యా! మాది అత్రేయపురమండి,

అ—నీపేరు.

రా—రామారావండి.

అ—ఏ రామారావు?

రా—ధరణీప్రగడ.

అ__సూర్యనారాయణగారి తాలూకు కాదా?
రా__చిత్తము. తమ కీయుత్తర మొసంగినారు.

(అని యిచ్చును.)

అ__(అందుకొని చదివి) నీకు వారికి సంబంధమేమి?
రా__ఆయన మామేనమామగారి పెత్తల్లి అన్నగారి మనుమలు.
అ__అలాగునా. సరే. ఆర్డరు పంపిస్తాను. వెళ్ళు.
రా__సెలవు తీసుకుంటాను. నమస్కారమండి.
అ__ఊ.

(రామారావు నిష్క్రమించును.)

( తెర పడును.)

---

మూడవ రంగము.

---

(ప్రవేశము - శ్రీరాములు.)

శ్రీ__ఈయనకూడా యిందులకే వచ్చియుండనోపు. ఏదోయొక సిఫారసు తగిలినట్లు తోస్తుంది.

(ఒకవైపుఁ జూచి)

అదిగో! నవ్వుమోముగానే యున్నది.

(ప్రవేశము - రామారావు)

శ్రీ__మీరు వెళ్లినపని యేమైనది?
రా__డంకామీద దెబ్బఁ గొట్టిచేయించుకొన్నాను.
శ్రీ__మేష్టరీయేనా?
రా__మీరు కోరినపోస్టే.
శ్రీ__మీకేదైనా సిఫారసు యున్నదా?

రా—సిఫార్సులోను తిరుగని సిఫార్సు. అదే లేకపోతే మీరేంతో నేనుకూడా అంతే.

శ్రీ—తామెవ్వరి తాలూకు?

రా—సూర్యనారాయణగారి తాలూకు.

శ్రీ—తాలూకాబోర్డు మెంబరుగారా?

రా—అగును. నేను బోవలెను. జవాబు.

శ్రీ—వెళ్ళవచ్చును. మీరెంతవఱకు చదివినారు?

రా—మూడవతరగతి కంప్లీటుచేసినాను.

శ్రీ—అంటే థర్డుఫారమా?

రా—మీరన్నది నాకుఁ దెలియు లేదు.

శ్రీ—ఇంగ్లీషులో మూడవఫారమా?

రా—కాదు. ఇంగ్లీషు చదివితేనా? మీరేమి చదివినారు.

శ్రీ—ఏమైతే నాయనా! మాకంటె మీరె మేలుగు.

రా—నేను బోయెదను.

శ్రీ—చిత్తము.

(రామారావు నిష్క్రమించును.)

శ్రీ—ఈయన మూడవతరగతి కంప్లీటుచేసినాఁడట. ఆహా! ఏమి వ్యత్యాసము? ఇఁక వీరాపాఠశాలలకుఁ దయచేసి, యేమూడవతరగతికో విద్య నేర్పుదురు.

అక్కటా! దేశమున కెట్టిదురవస్థ జనించుచున్నది. చదువు సంధ్యలతో పనిత్యము లేదఁట. అందువలననే ప్రాథమిక పాఠశాలల కెట్టిదురవస్థ సంభవించు చున్నది. కొలఁది వత్సరములకుఁ బూర్వమున్న విద్యాపాటవమునకును, నిప్పటి విద్యాపాటవమునకును నెంతయో వ్యత్యాసముకలదు;

“చింత చచ్చినను, బులుపు చావద”న్నట్లు తరగతుల పేర్లు మాత్రము మానకుండెను.

సీ. తరగతులనుగాంచి తాల్మిఁబొందుటె కాని
లేశమైనను లేదు లేఖవ్రాత
ఏటేట మార్పుల నెంచుచుంటయె కాని
నోరువిప్పఁగఁ జాలువారె లేరు
పెద్ద తరగతులంచు పెద్దపేరులె కాని
అంకెల లెక్కింప నలవికాదు
పెక్కుపాఠములంచు పేరు జెప్పుటె కాని
చదువంగ నొక్కటియు సరిగ రాదు

గీ. ఇట్టి పాఠశాలలఁ జేర నెట్టివిద్య
నేర్వనగునొక్కొ! బాలుర నేర్పుకూడ
రూపు మాపంగ నేర్పడె రూఢిగాను
పాప మేమియొ యీగతి బట్టెకుకుప.

తొల్లిటివలె నాల్గవతరగతియం దుత్తీర్ణుఁడైన బాలుఁడు లోకవ్యవహారములఁ దెలిసికొనఁ జాలకుంటయేకాక, కూలీల పద్దులనైన వ్రాయఁజాలకున్నాఁడు.

సీ. పద్దువ్రాయుమటన్న వచ్చెదనని చెప్పి
వెనుకంజవేసెడు వెట్టియొకఁడు
జాబునుజూపినఁ జదువంగఁ దీరిక
చాలదంచునుబల్కు చవటయొకఁడు
లెక్కగట్టుమటన్న లీలలఁ జూపుచు
మెల్లమెల్లగజారు మేటియొకఁడు
పొత్తములనుదెచ్చి ముందటఁబెట్టిన
వేళకాదనిచెప్పు వీరుఁడొకఁడు

గీ. కటకటా! యిట్టిసంస్థితుల్ కలిగియుండ
దేశమాతకుఁ గలవేమి? తెగులు గానిము
జీవములఁ ద్రాల్చి యుండుట చేయుకాదె
జీవయాత్రను జాలింప శ్రేయమగును.

వేదవేదాంగములును, పురాణేతిహాసంబులును నెందులకుఁ బుట్టఁబడినవి. మరం దెన్నఁడో పుడమినిఁ బుట్టు మూఢజనుల జ్ఞానులం జేయఁగదా వాల్మీకిమహామును లెన్నిన్నియో నీతుల గలపఁ బొత్తము లనేకములను రచియించియుండిరి. అట్టి మహోత్కృష్టం బగు వృత్తాంతంబులఁ జదివియు, వినియు నెందరెందరు యిహలోకంబున వన్నెకెక్కి తుదకుఁ బుణ్యలోకంబుల నందఁజాలి యుండిరి?

అక్కటా! వర్తమానకాలమున నట్టిపదవులు లేకుంటయే కాక, తా నెవ్వరో, యెందుల కీపుడమిని జననంబయ్యెనో, మనుజనకును, నితర జీవరాసులకును గల తారతమ్యమేమియో తెలిసికొన నేరని దురవస్థ యాంధ్రదేశీయులకు జనించుచున్నది కదా! భాషాజ్ఞాన మున్ననేతక్క పూర్వులవర్తనముల తెలిసికొనుటకు దారి కలదా?

ప్రస్తుత మీ ప్రాథమికపాఠశాలలో విద్యనేర్చి, తిరుగ నందే యుపాధ్యాయులుగఁ జేయుచున్న నీక నాంధ్రభాషాజ్ఞాన మంతరించుటకు నాలుగైదుసంవత్సరములకంటె నెక్కువ పట్టునని నిస్సంశయముగ నుడువవచ్చును.

ఆంధ్రదేశము తొలుతలోకమందంతటను బ్రసిద్ధిఁగాంచుచు, విద్యలకు నెల్లఁ 'బుట్టినిల్లగు'నని పేరు వడసినను, నేఁడు భాషాజ్ఞానమే లేని పురుషులకుఁ బుట్టినిల్లయి, వైధవ్యము నందిన స్త్రీ కైవడి, రోగపూరితయై యెట్లు భరింపఁజాలునో కదా.

ఓ కలియుగమా ! విద్వజ్జనవిధేయతగా మాదేశమున కిట్టి దురవస్థనుగూర్ప నేతెంచితివా ?

ఓ జననీ ! దేశమాతా !

గీ. సకలశాస్త్రింబులను నేర్పఁ జాలి నట్టి
పుత్రిసంతతి వడసియు భూరియశముఁ
గాంచియుండియు మాతరో! కడకు నేఁడు
విద్యలేనట్టి సుతులను వెంటనంటి
యెట్లు భరియింపనెంచితో నెవ్వగలుగు.

తల్లీ ! నీపుత్రులే నీకు శత్రువులై, సత్ప్రవర్తకులై యపారమోదముఁ గూర్చుటకుమారు, వెంగలులై దుఃఖాకులచిత్తనుగ నొనర్చుచు న్నారు. పరుల కసూయజనించిన జనింపవచ్చునేకాని, బిడ్డలకే తల్లి యం దీర్ష్యజనించు టెంతటి యాశ్చర్యకరము ? నిరంతర సుఖదాయ కంబును, సత్కృష్టపదవుల కాకరంబును నగుమాతృదేవతాపూజ నొనర్చుటకు మారుగ, మాతృద్రోహ మాచరింపఁబాల్పడు చున్నారుగదా. కట ! కటా! తాను దురదృష్టవశమున జరుగుచున్న, జరుగ నున్న మార్పులనుగాంచి, చింతిలి, యెట్లో వానిని దప్పించుటకై యత్నింపకుంటయేగాక, నీచమనక, బుద్ధివిహీనత సంతోసమును వెలిఁబుచ్చనారంభించిరి.

ఆహా ! కాలమహిమ !

గీ, పాపభీతికి వెఱగందు వారు లేరు
ద్రోహ మొనరింపవలె నని తోఁప దకట!
త్వేస లోలుకును బలుకులఁ దీపి కల్గి
పదవులే శాశ్వతం బంచుఁ బలుకుచుందురు.

శ్రీభగవానుఁడా ! మా కిట్టిమూఢత్వ మేలయొసంగితివి ? దేశమంద స్వస్థతకలిగి, భుజియింప నాహారమేయుండి యుంచుక

సౌఖ్యమబ్బునా, కన్నులుగానరావు. అందున నీకు నుద్యోగమేదైన లభియించెనా ?

గీ. పెంచి పెద్దగఁ జేసియు విద్యఁ గఱపి
బుద్ధు లనుజెప్పు జనకుఁడే మూఢబుద్ధి
శత్రురీతిని గన్పట్టు మిత్రులింక
నెట్టులౌదురో మదినెన్న నెవరివశము ?
సరకు సేయఁగ నితరుల శక్యమగునె.

ఆమదాంధత నెత్తి కెక్కినతోడనే తన కెట్టిసామర్థ్యత లేకపోయినను, నెదుటివా రెట్టిపూజార్హులైనను మదినెంచక, యధికారమదమున కే తావొసంగి, తృణీకరించు టెంతటి నైచ్యము ! ఎంచిచూడ నదిశాశ్వతసంపద కాదు కదా. అది వదలిన మఱునాఁటి యయ్యవారి యవస్థ లెటులుండునో, తలపోయకుండుటసరియే. తోడివా రెంత చుల్కనగఁ జేసి పల్కుచుందురో గ్రహింపలేకుండు టెంతయు మూర్ఖత్వము కదా.

గీ. అంధునకు వెల్తు రేవిధి నమరియున్న
శంఖనాదంబు చెవిటికి సరసనున్న
అందమౌ స్త్రీ నపుంసకు గట్టియున్న
నెల్ల వ్యర్థంబౌ యారీతి నిలనుజూడ
విద్య లేనట్టివాఁ డెందుడు వింతపశువు.

బుద్ధిమంతుఁ డెన్నఁడును న్యాయమును వీడఁ జాలఁడు. అధర్మములఁ జాల్గొనుట కతని కశక్యము. ఇతరుల బోధనలకు లోనుగాఁడు. అట్టి సద్గుణవంతుఁడగుటకు మూలాధారము విద్యయేకదా. విద్యయే లేకున్న, స్వాతంత్ర్యమే లేకుండుటయేకాక, దుర్మార్గులవలనఁ దగులొల్కొనుటయును గల్గును.

ఇంతయుఁ దర్కించిచూడ మనుపటివారిఁ బ్రియవేటుములు

జెలువడినదికాని, ప్రారంభవిద్య యెలవడుట కల్ల యనియే చెప్పవచ్చును. జీతము లిచ్చెదువా రొకరు. పరీక్షాధికారు లింకొకరు. నైరొక్కరిపల్కుల నౌకరు లెక్కింపబడకుండుటచే, నుపాధ్యాయులును జాలమంది విద్యనేర్పినను, నేర్పకున్నను దమ వేతనములు తమకువచ్చునుగదా యని తమ విధికృత్యంబులఁ జాలమట్టునకు విడనాడుచున్నారు. యేపనిని చేయుట కయినను భయముకాని, భక్తికాని యుండవలెను. రెండును లేనిచో——ఆలోచనీయమే...

సీ. పెర్మనెం టగుపోస్టు భిన్నమే లేదని
బడికి వేళకుఁ బోని పంతు లొకఁడు
చెప్పన లేకున్న చేటు లేదంచును
ధ్యానంబు సలుపు పుపాధ్యాయుఁ డొకఁడు
వేతనంబులుమాకు విరివిగి లేవుగ
నిచ మంచును బల్కు టీచ రొకఁడు
అధికారు లెన్నఁడు నరసి చూడ రటంచు
కునికిపాట్లను బడుగురువు యొకఁడు.

గీ. చెప్పఁజాలియు నీరీతిఁ జెప్పకుండఁ
గాల మెట్టులో కడపుచు మేలమాడు
వారు కొందఱుఁ జెప్పంగ నోరులేని
వారు పెక్కండ్రు యిట్టులఁ బలు గతులను
వెలుఁగుచున్నది ప్రారంభవిద్య గఱప.

ఓ భగవానుఁడా !

సీ. పాపముల్ తొలగించి ప్రారంభవిద్యకుఁ
దోడ్పడ నెల్లరఁ దోలవయ్య !

ఓ దేశోద్ధారకులారా,

## చతుర్థాంకము.

ప్రారంభవిద్యయే ప్రథమసోపానమ
నని బోధనల్ సల్పి యలరవయ్య

ఓ ప్రాథమికపాఠశాలోపాధ్యాయులారా !
అశ్రద్ధలను వీడి యాసలం బురిగొల్పి
ప్రారంభవిద్యకై పాటు పడరె !

ఓ విద్యాశాఖాధికారులారా !
ప్రారంభవిద్యకు భంగము లేకుండం
దగినట్టివిధులను దలంచరయ్య.

ఓ మహాజనులారా !

గీ.. ఇహపరంబుల కెల్లను నేది మూల
మగునో యట్టివిద్యను జూడ మక్కటకట!
లెందు లే లెందు విద్యకై లేదె హితము
పాడువడ నుండె దేశము పాటు వడరె.

(ప్రవేశము—సుబ్బయ్య.)

సు—ఓహో ! శ్రీరాములుగారా ! యెవ్వరో యనుకున్నాను. మీ
కీ కంఠశోష యెందులకయ్యా ?

శ్రీ—అవును నాయనా ! కంఠశోషయే. మీ బడిలో నెన్ని తరగ
తు లున్నవి ?

సు—ఎన్నో కొన్ని యున్నాయి. మీ రేమి జీతములనిచ్చి నిలంబెట్టి
రా ? ఆబోర్డువారు మాకెన్నండో ఋణపడియున్నారు. ఇ
ప్పుడు తీర్చుకుంటున్నారు. నాయిష్టంవూడి: అధికారులకే
లే నప్పుడు శ్రద్ధ మా కుంటుందా.

శ్రీ—అయ్యా ! నాదొక్క మనవి. అధికారులు మిమ్ముం జెప్పవ
ద్దన్నారా ? మీ బిడ్డల మీరు బాగొనర్చుకొనుటయు నధి
కారు గౌరవమేనా ?

సు.—ఈలాటి వేదాంతములు వింటే యంతాబువ్వే. దేశోద్ధారకులు బయలుదేఱినారు. ఇచ్చేవి పదునెనిమిదిరాళ్ళు, ఈ జీతాలికీ చదువు చాలు.

శ్రీ.—అయ్యా ! ఆసామ్ముకు వార్షించియే కదా మీ రందుఁ బ్రవేశించిరి ?

శు.—అయితే.

శ్రీ.—అందుల కెప్పు డొడంబడినారో, యాపని నెఱవేర్చుటయు విధికృతము.

సు.—ఇదేమి నిర్బంధచట్టమా ?

శ్రీ.—అయితే లెస్సగఁ జేయుదురు కాఁబోలును.

సు.—అయిన నప్పుడు వేఱుగనుండవచ్చును.

శ్రీ.—ఈయల్ప మగువేతన మప్పు డెట్లు తగియుండును ?

సు.—చాలినను చాలకున్నను దప్పదు.

శ్రీ.—సరియేకదా. అట్లు యిప్పుడును నిందుక పరమార్థ మాలోచించి, యొనర్చుట శ్రేయోదాయకము గదా. బీదతికమున నుండె నని, వనితలు భర్తల విడనాడుదురా ?

సు.—ప్రస్తుతముమాత్ర మ్యూరకుంటిమా ? తోఁచినంతవఱకుఁ జెప్పుచునే యుంటిమి. ఈవత్సరము మా బడిలో నాల్గవతరగతి యందుఁ బదున్నైదుగురు సర్టిఫికెట్లను బొందియున్నారు.

శ్రీ.—సర్టిఫికెట్ల కేమిభాగ్యం నాయనా.

సు.—ఎంతమాట ! చదువుమాట యెటులున్నా . సర్టిఫికెట్టంటూ యుంటే యేమేష్టరియో సంపాదించుకొని పదిరాళ్ళు తెచ్చుకోవచ్చును. బాబూ ! నేనొక్కటిచెప్పెదను వినుఁడు. ఏదో కాలక్షేపము. మాస్కూళ్ళకు, యినస్పెక్టరువారు సంవత్సరమున కొకమాఱు వచ్చెదరు. వచ్చినప్పుడైనా, వారి రిమా

ర్కులఁగాంచి మమ్ముల నడుగరు. ఒకవేళ వారు బాగున్న
దన్నా ప్రయోజనములేదు. జీతములిచ్చువారు. తాలూకా
బోర్డువారు. పరీక్షలకు వీరు. ప్రెసిడెంటువారికి స్కూళ్లకు
దిరుగుట కొకపనికావుకదా. అదియు మాపుణ్యమే. ఇంత
గోల? చేసిన స్కూళ్లలో మాదే రాజ్యము—

శ్రీ—అట్లనుట న్యాయమా? తల్లిదండ్రులు తమబాలుర సంరక్షణ
లకే కర్తలుకాని, మిగతవాని కన్నిటికిని బాలురకు మీ
రే యాధారులు. దేశమందు భాషాజ్ఞానము శూన్యమగునెడ
నందువలనఁ గల్గు నష్ట మనుభవించువారు మనపిల్లలు కాగా?
ప్రాథమిక పాఠశాలలోపాధ్యాయు లందఱకును వందనీయు
లు. యెవ్వరెట్టి యున్నతపదవుల నధిష్ఠించినను జిన్నతనమం
దార్జించు ప్రారంభవిద్య నాధారముఁ జేసికొనియేకదా.

సు—అగును. మీరుచెప్పు నుడువు లన్నియు నిక్కములే. కాని,
యిఁక నీపాఠశాలలు బాగుగుట కల్ల.

శ్రీ—వండుకొనుట కష్టమని యన్నము తిన మానివేయుదురా?

సు—అన్నమునకును జదువునకును సాటియా?

శ్రీ—అగును. సాటికాదు. ఏమందురా?

గీ. శునకమాదిగ జంతువుల్ శుకపికాది
పక్షిజాలములు భక్షించి బ్రదుకవొక్కొ
తినిన లేకున్న నదియింత తీపికాదు
చదువు లేనట్టివానికిఁ జావెమేలు.

సు—చదువులేకున్నఁ జచ్చిపోవుచున్నారా?

శ్రీ—ఎట్టి యర్థమును గ్రహింపఁజాలితిరి? మృతజీవులు జీవన్మృతు
లని రెండు తెఱఁగులు.

సు—అంటే నాకర్థము తెలియదు.

శ్రీ—పంతులుగారూ! దీనికే యర్థము తెలియనిచో గురుత్వమెట్లు ల నబ్బుచున్నారు?

సు—బాగున్నది. అ, ఆ, ఇ చెప్పలేనా?

శ్రీ—ఎల్లకాలము అ ఆ లేనా?

సు—కాకపోతే నాకు రానిది నేను చెప్పేదేమిటి?

శ్రీ—మంచివారండి. ఉన్న దున్నట్లు చెప్పినారు. అయితే చెప్పెదను వినండి. మృతజీవులనగాఁ జనిపోయినను బ్రతికియున్నను, అట్లే పరిగణింపఁబడుదురు. జీవన్మృతులనగాఁ బ్రతికియు న్నను జచ్చినవారిలోనే జమ. విద్యరానివాఁడును రెండవరక ములోనే చేరును.

సు—బాబూ! మీరు చెప్పెడివన్నియు నాకును నచ్చినవి. ఈవిద్య యెట్లు బాగుపడునో చెప్పుదురు. ఏదో యీలాగున నలుగు రు మొట్టలు పెట్టిన కొంతవఱకు దేలవచ్చును.

శ్రీ—మొట్టలా? ఏమన్నా అంటే మీకు మేష్టరీ యివ్వ్యలేదా యని కొందఱు శుంఠలు మొదలుపెట్టుదురు. మాగ్రామము లోనే యీపదవి నాకు దయచేసిన తమ ఆర్డరుకు లోఁబడు పద్ధతిని వేతన మక్కఱలేకయే చేయువాఁడనని యడిగినను, నేమి చెప్పుదును? యీపత్రికెడంటువారల్లా యిచ్చుటకుఁ దమ కార్డర్లులేవనియు, వేతన మిచ్చుటకుఁ దావు లేదనియు శలవిచ్చినారు. రేపు మాపులతోనే కాలము గడచిపోవుచు న్నది. పిల్లలకుఁ జదువు రాకపోయినా దేశమంతా గంగలోఁ గలిసినా వారిపదవులు వారికే పెద్దవి కద, ఇంతకన్న నీబ డులు గవర్నమెంటువారికింద నున్నప్పుడే తెన్నుగ నుం డెడివి.

సు—దీనికేమి కాని, బాగుపడుటకు మార్గము లేవా?

శ్రీ—(1) శ్రీగవర్నమెంటువారు విద్యావిధానమును దగినంతమట్టుకు మార్పుఁ జేయుట. (2) పరీక్షాధికారుల యుద్దేశములో స్థానిక స్వపరిపాలనా ధురంధరు లుద్భవించుట, (3) తాలూకాబోర్డువారు తగినంతవఱకుపాధ్యాయులకు వేతనముల వృద్ధిఁ జేయుట.

ముఖ్యముగ నీ మూఁడింటివలనను గాలక్రమములోనే ప్రారంభవిద్య యున్నతపదవు నలంకరించునని నా యభిప్రాయము.

సు—సత్యము, సత్యము. ఏది యెటులున్న నాభోజనమునకు వేళ యైనది. పోవుదము రండు. అన్నట్లు మఱచినాను. ఉపాధ్యాయులు కొందఱు శక్తిఁ గొలఁది పనిచేయుట లేదుకదా. వారిమాటయేమి ?

శ్రీ—దీనికిఁ బెద్దయాలోచ నెందులకు ? ఎప్పుడైతే తాలూకాబోర్డు వారు పరీక్షాధికారులు యేకమగుదురో, యప్పుడే వారినడతలు బాగగును.

సు—పోదమా ?

శ్రీ—నడువుఁడు. (ఇరువురును నిష్క్రమింతురు.)

(తెర పడును.)

---




## పంచమాంకము

(ప్రవేశము—రాజబాట.)

(తెఱలో)

ఉ. పుట్టితి నీయిలన్ వగపు భూరియశంబునుగాంచఁ జొచ్చునే
బుట్టగనేల? ప్రేమకిలఁ బుట్టినిలా తలిదండ్రులే వడిన్
కట్టడినంచు 'దూషణలఁగాల్చఁ దొడంగిరి భర్తఁ-వీడె నే
నెట్టులఁ దాళుదున్ గరుణపుట్టదె? నీకును కావు మీశ్వరా!

(అని చదువుచు యోగినీ వేషంబున రుక్మిణి ప్రవేశించును)

రు.—అక్కటా! భగవన్మాయ నెఱుంగ నేరికి వశమగును? క్షణభంగురంబులగు నీయిహలోకసుఖంబులే శాశ్వతంబగు నని యెంచి యందేపడి మ్రగ్గుచున్న నదియేసుఖదాయకంబుగను నిత్యమనియుఁ గన్పట్టును. అవస్థాభేదంబులఁ బట్టి విరక్తిమార్గ సంచారులై యీప్రపంచమే మిథ్యయనియు, నిందు జరుగుచున్న విషయము లన్నియు ననిత్యములనియు భావనచేసి తిమా తుద కదియే సౌఖ్యంబున కాటపట్టగును. (తన వేషమును దిలకించి) అహా! నావేస మెంతలో మాఱిపోయి నది. నిక్కముగ నేను మునుపటి రుక్మిణి నగుదునా?

సీ. సొమ్ముల్ల ధరియించి చూడ్కుల నిగిడించి
యద్దంబునన్ జూచి యందమంటి

ప్రతిదినమునఁ గూడఁ బలుఁదోమినంతనె
అలకముల్ దిద్దియు నలరియుంటి
మోమును గడుగుచు మోక్షమే యదియని
బొట్టు గంధముతోడఁ బెట్టియుంటి
వన్నెలెన్నుచు మది నెన్నెన్నొ వాంఛలఁ
జీరెల, రవికెలఁ జేర్చియుంటి

గీ. అదియు నప్పటి సంతోషమయ్యె నేఁడు
జుట్టువిరియంగఁ బోసియు పట్టుబట్టి
తాల్పఁ గాషాయవస్త్రముల్ తరుణమయ్యె
ఎది యెన్నఁడు లభ్యమో యెవ్వఁడెఱుఁగు.

అందువలననే కాఁబోలును, ఎప్పుడెవ్వరికెట్టి యవస్థలు సంభవించునో, యదియే విధికృతమని తలంచి నిర్విచారంబున ననుభవించుటయే కర్తవ్యమని బుధులు నుడివియున్నారు. కాని—

ఉ. చదివితిఁ బెక్కుశాస్త్రములఁ జాలగ నేర్చితి ధర్మమార్గముల్
చదివితినెన్నొ బోధనల సల్పెడు తొల్లిటి సచ్చరిత్రలన్
చదివితి సాధ్వివర్తనముఁ జాలుదలంచును నాచరింపగన్
చదువుల మూలమిట్టులయె సాధ్యమె పీడగఁ గర్మమూలముల్

ఎందుగాంచినను సతులకుఁ బతిశుశ్రూషయే యిహపరసాధనమని చెప్పఁబడియున్నది. అది లభ్యముకాక వ్యర్థురాలనైతిని గదా. అయ్యో! కాలమెంత దుర్ఘటమైనది. తొల్లిఁటి సీత, రుక్మిణి మొదలగు మహాసాధ్వీశిరోరత్నముల మదినెంచి యిహపరసాధనమగు భర్తపాదారవిందసేవయే చేసి, వరలుదమని యెంతగ మది సంతసించితినో యంతకు వేయిమడుంగు లెక్కుడుగ దుఃఖమనుభవించు కాలము ఘటించెను గదా.

ఓభగవానుఁడా! మాకు స్వాతంత్ర్యమే లేకుండఁజేసి తలిదండ్రులు తమ యిచ్ఛవచ్చిన పురుషులకుఁ గట్టఁబెట్టియుఁ బిదప నత్తవారు భార్యాభర్తలకుఁ బొందుఁగూర్పక యన్యాయముగ విపత్సముద్రంబుల ముంచివేయుటయుఁ గనులారఁ గాంచుచుండి తము వారొనర్చిన తప్పిదంబులనియెడు శరంబులకు మమ్మాహుతిఁజేయు టెట్టి ధర్మమో, కనులారఁ గాంచుచును నూరకుండుట పాడియగునా?

గీ. దిక్కులేనట్టివారికి దిక్కునీవె
యనెడు బుధులవాక్యము కల్లయగునె యయయ
నాథుఁ జేరఁగలేని యనాథలమగు
మాకు నేదారిఁ జూపెదో మసలనింక.

ఓ మగబిడ్డలను గని కష్టముల కాసించు మహానుభావులారా!

సీ. ధనము నార్జింపంగఁదగు సాధనము మీకు
వనితల గొంతుకల్ పట్టిగోయుక
ధనము నార్జింపంగఁదగు సాధనము మీకు
భార్యభర్తల పొందు భంగపఱుప
ధనము నార్జింపంగఁదగు సాధనము మీకు
కూడులేకుండఁ గొంపలనుగూల్ప
ధనము నార్జింపంగఁదగు సాధనము మీకు
పెండ్లిండ్ల నెపమున బీల్చివేయు

గీ. ధర్మశాస్త్రంబులనియెడు దారిలేదె
పుణ్యపాపంబులనెయెడు బుద్ధిలేదె
నీచముచ్చ మనంగను నీతిలేదె
ఎవ్వరొసగిరి స్వాతంత్ర్యమిట్లు మీకు.

పురుషులమనియా మీకీగర్వము?

గీ. పుట్టితిమి మేము మీవలెఁ బురుషులైన
అక్రమంబుల నెంచిన నదమమనక
న్యాయమన్యాయమనకను నడచుచున్న
లేఁడె భగవానుఁ డెందును రాఁడె నాఁడు.

ఈయిహామందు మీకు నితులఁ గఱపువారు యున్నను, లేకున్నను, వారిపల్కులఁ జెవినిడక యదియే యాచారమని నిరంకుశాధికారములఁ గొనసాగించుచున్నను భగవంతుని మాత్రము మోసగింపఁజాలరు. ఇది మీకెంత శాశ్వతమో మాకును నంతేశాశ్వతము. భగవానున కందఱును సములే. వనితల నిట్లకారణముగ దుఃఖములపాలొనర్చి మిమ్ముల నీయిల నుద్భవింప సేయుటే దని యెఱుంగుఁడు. నిష్కారణముగ మమ్ములను మమ్ములనుగన్న తలిదండ్రులను సుక్కఁజేయ, మీకుమాత్రి మెల్లు శాశ్వతసుఖంబు లలవడును? అయ్యో! ఈకట్న పిశాచము లేనాఁడైనఁ గలదా?

(ఆలోచన నభినయించి) ఇట్లెన్ని రీతులఁ గుందుచున్నను నేమి ఫలము? నా యీయరణ్యరోదన మాలించువారెవ్వరు? ఏమైన నాపరమేశ్వరునిదే భారము. (కన్నులుమూసి చేతులు జోడించి) ఓ దీనవత్సలా! ఏను దొల్లి యెట్టి మహాపాతక మాచరించియున్నను నీప్రాయశ్చిత్తము చాలును. ఇఁకనైన నాప్రార్థన లాలించి నాయీయాప్సితార్థముల నెఱవేర్పుము.

ఉ. ఎయ్యది పుణ్యకార్యమగు యింతులకున్ సతతంబు మేదినిన్
ఎయ్యది మోక్షసాధనము యేవిధినాఱసి యెంచి చూచినన్
ఎయ్యది లేక యింతులిల నెందులకున్ గొఱకాకయుందురో
అయ్యది భర్తృసేవయగు అందగ జేయవె మ్రొక్కెదన్ సదా.

(అని నిష్క్రమించును.)

(తెరయెత్తఁబడును.)

(ప్రదేశము:—వేశ్యాగృహము)

(ప్రవేశము:—సుందరం)

సుం—(తలుపుఁదట్టుచు) మణిమాలా! మణిమాలా.

(తెరలో)

ఎవ్వరువారు ?

సుం—ప్రతిదినమున వచ్చుచుండువారే.

(తెరలో)

పలుకులకేమి,చిలుకపలుకులెన్నియైన పలుకవచ్చును. ఇప్పుడు తలుపుఁదీయుటకు వీలులేదు.

సుం—ఒక్కమాట.

(తెరలో)

మాటలకేమిభాగ్యం కుక్కతిరిగినట్లు తిరుగుచున్నావు నీకేమి పనియున్నది. నీలాగె అందఱును తీరుబడిగాఁ గూర్చుంటు న్నారను కున్నావు కాఁబోలును. చెవికోసిన మేఁక లాగున వచ్చినది లగాయతు అర్పేకదా. ఎన్నిమారులు రావద్దని చెప్పినా బుద్ధిలేదు. ఛీ అంటే కుక్కకైనా సిగ్గుం డునుగాని నీకా, సిగ్గులేదు.

(అని కసరుచు తలుపుఁదీసి యీవలకు వచ్చి)

మ—ఏమిదాఁచఁబెట్టినావు?

సుం—అయ్యయ్యో! ఇదేమిపాపము? తండ్రియార్జించిన ధనమంతా నీకేపెట్టినానుగదా. తుదకు నాయీదుర్గుణంబులఁ జూడలేక మంచముఁబట్టి గతించినాఁడు.

మ—మఘాపోసి 'చచ్చినవానిలాగే! నీవుకూడ నాయనతోఁబాటు చచ్చియుండలేకపోయినావా!

సుం—రామ, రామ, నీమూలమునగదా పుస్తెకట్టిన పెండ్లామును
నిప్పటివఱకును జూడలేదు.

మ—సరి. సరి. పైగా యిదియొకటా. నీ తండ్రిలో భిన్నమై కార్యముఁ
జేయకుండెనని యప్పుడేడ్చి, యిప్పుడు నా మూలమునా!
ఫో. ఫో. ఇంకాకొంత సేపున్న నన్నే నిలబెట్టితినెదవు. నీ
విచ్చినడబ్బే యింట్లో మూలుగుతోంది. నీవేదో మహాపట్టి
పోషిస్తావని లక్షాధికారు లెంతమంది వచ్చినను విడుచు
కొన్నాను. నడు. నడు.

సుం—అయిన నీక నాగతియింతియేనా!

మం—గీ. ధనముకై కాదె మానంబు ధారవోసి
మిమ్ము మిమ్మలఁబట్టియు మిడుకుచుంటి
ధనము పోయినమఱునాఁడు దలఁపనేల!
పొట్టకూటికిఁ జేటుగుఁ జెట్టఁబట్ట !

సుం—చెలీ! యింత యవినీతి సెల్లునా?

సీ॥ సరసంబులాడఁగ స్వర్గమంచును నెంచి
ధనమంత దొంగిలి తార్చినాను
నిన్నె నమ్మితిసన నిక్కమేయనుచును
పాంసరీవోట్లకుఁ బరుగులిడితి
నిమిషంబుఁజూడక నిల్వగలేనన
మానసంబునపొంగి మసలియుంటి
కరుణకై నిత్యముఁ గాచియున్నానన
మేనుతెలియకుండ మెలఁగినాను

గీ. ధనమునకియించె మర్యాద తరిగిపోయె
కులసతిని బాసియుంటిని కొంపకూలె
కన్ను గానక తిరిగిన కారణమున
తండ్రిదివిఁజేరె కోర్కెలు దగ్ధమయ్యె.

మ.—ఏ కోర్టులోనో రెండువేల యైదువందలు వచ్చునంటివి కాదా? అవియేమయ్యెను?

సుం.—అయ్యో! దరిద్రుఁడు తలంటుకుఁ బ్రారంభించిన వడగండ్ల వానయట. దావా కొట్టివేశినారు. పైగాఁ బ్రతివాదులకర్చు లనిచ్చుకోవలసినదని తీర్పుఁ జెప్పినారు.

మ.—కొంపయున్నది కాదా?

సుం.—అదియు నా దనఖాలలోనే మునిఁగి యున్నది.

మ.—అయిన నీకుఁ జెప్పను గట్టిను బుచ్చుకొని బయలుదేఱుము. పొమ్ము. ఆవలకు నడువుము. లేకున్న గెంటించి వైతును.

(అని తలుపునుమూసి లోనికిఁ బోవును.)

సుం.—అక్కటా! కలధనమంతయు నొసంగి వలయునెడ శక్త్యానుసారముఁ బరిచర్యలఁ జేసి తుదకు నేఁ డింటనడుగు వెట్టుటకుఁ గూడ వీలులేక ఏధినుండియే వెనుకకుఁదరల వలసినయోగమే కూడెనుగదా. కటకటా! యీ లంజకై యెన్ని యవమాన కరములగు బనులనిచ్చలో నెఱవేర్చితిని. ఇటకు రావలెనని కోర్కెకల్గిన వేళ...

సీ॥ రాజబాటనుబోక రాత్రికాలంబైన,
సందు గొందులవెంట సాగినాను
తండ్రివాకిటనున్న తలుపు మెల్లగఁదీసి
పెఱటి దారినిబట్టి మగిడినాను
కోరుట తడవుగ కోర్కె లన్నియు
నర్పించి ముదమంచు నలరినాను
వలదంచు నీతులఁ బల్కెడువారల
దుర్మార్గులంచును దూరినాను.

మన్నను వారాదరింతురో లేక యాదరింపకుందురో? ఆదరింపకున్న నింక గతియేమి?

(ఆలోచించి)

గీ. చేసియున్నట్టి పాపంబుఁ దొలఁగిపోవ
పుణ్యనదులకుఁ బోవుచుఁ బుణ్యపురుషు
లైన వారిని జేరుచు నాత్మనెపుడు
దైవచింతనుగడపు లేఁ దగును నాకు

(అనుచులోనికిఁబోయి తిరుగ సన్యాసివేషంబునవచ్చి)

ఓ సర్వేశ్వరా!.

ఉ. చేసితినెన్ని యో విఘ్నులఁ జేయఁగరానివి దుష్టబుద్ధిచేఁ
జేసినవానినేదలఁపఁ జేయునదేమియొ తోఁపదక్కటా!
చేసిన పాపమేమి తొలిఁ జేయనిఁ కెన్నఁడు దైవమా! యికఁ
దాసయుఁ జేయుమయ్యమది భక్తినిగొల్చెద పీడకెన్నఁడున్.

గీ॥ దుష్టవర్తనలిటియని తోఁపనీదు
హాస్యవృత్తులె సద్వృత్తు లనగఁ బరఁగు
ఆత్మగౌరవమంతలో నంతరించు
లేమిదటిఁ జేరువానికి లేదుబ్రదుకు

ఉ. దోషముపాయుఁ బౌరుషము రూఢిగఁబోవును నిందకల్గునం
తోషముదూరమౌను గడు దుర్భరమౌ ఘనకార్యముల్ వడిన్
వేషములెన్ని యేనియిడ వేడుకపుట్టును మానహీనమౌ
దోషములన్ని చేరుఁ గడ దూషణలందగ డబ్బు లేమిచే

(అనుచు నిష్క్రమించును.)

(తెరపడును.)

రెండవ రంగము

(మధురాపురమందలి రాజవీధి)

(ప్రవేశము:—రుక్మిణి)

రు—ఇదియేకదా మధురాపురము! దేశద్రిమ్మరినై యెండనక వాన యనక మార్గాయాసంబు భరింప నశక్యమైనను నోర్చి యోర్చి నేటికీ పురమును జేరనయ్యెను. ఎన్నికష్టములనను భవించినను తుదకు నా కోరిక నెఱవేరుననియె డాసచే నన్నియు సుఖదాయకంబులుగనె కన్పట్టుచుండెను.

దైవమా! ఇంతటితోనైన నాచింతల కంతరాయము గల్గునట్లు ప్రసాదింపుము.

తండ్రీ! జగన్నాయకా!

ఉ. పుట్టినదాది సౌఖ్యమన పోల్కియె లేదుగ దోసమెద్దియో
గిట్టుట కల్గదోకటా! యిఁక కేవల మావిభుపూజకై నే
వట్టిదురాసలన్ దిరుగ భంగముచేసిన భాగొనష్టినన్
పట్టితి నీదుపాదములె భారము నీయదె సాధుభూషణా.

(అనుచుఁ బోవుచు మరల యాగి)

అయ్యో! ఇంతదనుక నున్న సంతోషము రానురానే కలంబుననో యంతరించుచుండెనే హేతువేమైయుండును? ఏ నెపమున నా యత్తవారిలు సేరఁబోదును? నీవెవ్వరవనిన నేమని ప్రత్యుత్తరమిచ్చుదాన? నాయత్తమామలు...

ఉ. ఎవ్వరిదాన వీవు కుల మెయ్యది? యిందును జేరనే కతం
బవ్విధియనంగ నేమనుచు నందును నెయ్యది కాపురంబనన్
నవ్విధిమార్చి చెప్పగను యోనటఁ జాలదో తోఁషదింతయున్
నవ్వులఁ జూపి పల్కులను నమ్మకయుండిన నేమి నేయుదున్.

వారినెట్లో కప్పిపుచ్చుచుదమన్నను నా ప్రాణనాథుఁడే నా సేవల మన్నింపక కున్న నిఁకఁ దెలువేమి? అదియును సాధ్యముకాకున్న...

గీ॥ తొల్లిఁజేసిన పాపపు దోసమనియుఁ
దప్పదంచును నెప్పుడు దప్పుమనియు
ననుభవించుచు దుఃఖము నాత్మ దేవ
దేవు భక్తినిగొల్చుచుఁబోదు దివిని జేర.

ఒకవేళ నాప్రాణేశ్వరుని సేవ లభింపకపోవచ్చునేకాని

చ. కనుపడదే యిలన్నెదక గా నిసుమంతగరాళమున్ వడిన్
గనుపడదే యెటన్ గనగఁ గాలముఁదీర్చెడు నీటిపట్టులున్
ఇట్లేల ?
అనలములేదె మృత్యువన నాయుధమొయ్యెడఁగానరాదె నా
మనమలరన్ యిదేవిధము మాధవు వేడుచు భూమిఁబాసెదన్.

అనుచు నిష్క్రమించును.)

(తెర లేచును.)

(వెంకటేశ్వర్లుగారి గృహపరిసరము)

(ప్రవేశము:—రుక్మిణి.)

రు—వారుచెప్పిన నానవాళ్లన్నియు నీయింటియందే యున్నవి.
(ఆశ్చర్యముతో నలుదిక్కులు పరిశీలించుచు) ఏమిదీ? యీగృహము పాడుపడి నట్లున్నదే. కతంబేమైయుండును ? వారియిల్లిదియగునో, లేక మార్గముతప్పి వేఱొకవీధికి వచ్చియుంటినో ? ఈచుట్టు ప్రక్కల నొక్కరును గానరాకున్నవారే. ఏమి సేయుదాన ? మనంబునను, నాహృదయము తత్తరపాటు నందుచున్నది. ఒక్కొక్కవేళ నపారంబగు సౌఖ్యములు పడనున్న వేళను, దత్తరపాటు కలుగవచ్చునట. నాకట్టిభాగ్యమే సళించునే. ఇంత యది నేదియో ముప్పునకే సూచనమైయుండనోపు.

హా! పరమేశ్వరా!

గీ. చెమటోడ్చి కష్టమ్ముఁ దోడఁగాను జేరఁబెట్టి
దుఃఖమతిశయించెడురీతిఁ దోఁచుచుండె
నిష్ఫలంబగునో కదా నీరజాక్ష!
భారమంతయు నీయదే పద్మనయన!

(ప్రవేశము—రఘునాథము మార్గమునఁ బోవుచుండును)

రు—ఆర్యా! వెంకటేశ్వర్లుగారి గృహ మిదియేనా?)

ర—(తిరిగిచూచి) మీ రేయూరు?

రు—సన్యాసుల కొకగ్రామమనియుండునా?

ర—ఎందులకు?

రు—వారిదర్శనముఁ జేసిపోవలయునని—

ర—నీపల్కులు వింతగనున్నవే! ఆయనగతించి క్రిచాలకాలమైనది.

రు—(కన్నుల నీరు వెట్టును.)

ర—నీ కేలవిచారము?

రు—ఉపకారులు గతించిరనువార్తఁ జెవిసోకిన విచారముకాదా?

ర—అయిన నీవు ధన్యురాలవే. ఆయనయెన్నఁడుఁ బిల్లికి బిచ్చముఁ బెట్టియెఱుంగని మహాపురుషులలో నగ్రగణ్యుఁడు. కాని, కష్ట పడి సంపాదించినారు. ఏమిప్రయోజనము?

రు—(తత్తరపాటుతో) ఆర్యా! ఏమది? ఆయన కొకపుత్రుఁ డుండెనుగదా.

ర—ఉన్నను నిప్పుడు లేనివానిలోనే జమ.

రు—(తనలో) మానసమా! వేగిరింపకుము. శాంతమా! ధజేఁ జేరుము. (ప్రకాశముగా) నాయనా? అట్లనుచుంటి రేల?

ర—ఏమున్నదమ్మా. అయినవాస్తి యంతా సానికిఁబెట్టి చేతులఁగడుగుకొనియున్నాఁడు. అడిగినావ్రకమునకుఁ జెప్పవలసివచ్చినది. ఈ

నడుమ నొకనాఁటిరాత్రి స్థానిక్యుంటి కేతఁడు బోఁగా దుర్వ్యా
పలాడి యావలకుఁ బొమ్మనెన్నఁట. అందువలన నాతఁ డూరు
వదలి వెడలెనఁట.

రు—హా! నాథా! (అని మూర్ఛమునుంగును.)

ర—(భీతితో) అయ్యో! యిదియేమి? నేనిఁటనున్న, నేదియో యా
మెను బాధించితినందురు.

(అని నిష్క్రమించును.)

(కొంతవడికి మేలకువగాంచి దుఃఖముతో) హా! దైవమా! నాకింకేమి
తెలుపు? నానాధునియండఁ జేరి, పరిచర్యలఁ జేసినయెన సుఖం
బనుభవించుదాననని యువ్విళ్ళూరుచుండ నదియును సున్న
యయ్యెనే. అయ్యో! దురదృష్టవంతుల బాగొనర్చువారు
కలరా?...

హా నాథా! మీకును నాయట్టి యదృష్టమే సంభవించెనా?
భర్తయని యొకనాఁడైనఁ గన్నులెత్తి మిమ్ముల వీక్షించి
సంతసమందుభాగ్యమే లేకపోయెనుగదా. ఈరీతినైన మీరు
సుఖంబున నలరారుచుండఁ గాంచుచు, మీపాదారవిందసేవ
నొనర్చి, యిహపరసుఖంబందుద మనుకొంటినే. సానులిండ్ల
కుఁ జేరు దుర్బుద్ధి మీ కేల జనించెను? ఇంతయు జననీజనకుల
తప్పిదమే కదా. నేనుమీయండనుండి దినదినము ప్రార్థించు
చుండిన గొంతవఱకైన సద్బుద్ధిజనించి యుండునే మో కదా.
ఎంతగ ధనవంతులైనను దుదకుఁ దినుట కన్నముగూడ లేక
పోయెనుగదా. రానున్న యిడుమల భరియించఁజాలక, యెం
దేగితివి? ఏరీతి మిమ్ములను గలియుదాన? ! ఇట్లు దుఃఖాకుల
చిత్తనై, యెట్లోర్చియుండుదాన? ఈవరకట్టిన్నము లేకదా
మనలనింతవఱకుఁ దెచ్చినది. ఘోరైన మీజనకునకు బోధిం
పఁ జాలకుండిరా?

సీ. భర్తనువిడనాడి పడతులుండెడు తావు
యమలోకమున కెన యగునుగాదె
నిజనాథుఁ గోల్పోక నెలఁతలవర్తనల్
దుష్పథంబులనగఁ దోఁచుఁగాదె
ప్రాణేశుపరిచర్య భంగపడిన వేళఁ
గొఱగాక యుంటయే కూడుకాదె
జీవితేశుఁగనక చేరి దేనినిదిన్న
గరళంబుపగిదిని గానరాదె
గీ. ఇంతయేలను పుడమియే హేయమగును
బ్రదికియుండిన ఫలమేమి వరునిబాసి
జీవములఁదాల్చి యుంటయే చేటుకాదె
కటకటా! యెట్లునిలువంగఁ గాంతకగును.

ఓమృత్యుదేవతా! ఇఁక నీవేశరణ్యము. అదృష్టదేవత నన్ను జిన్ననాఁటనే వీడిపోయెను. శాంతమా! నాదరిఁ జేరుము. ...

అయ్యో! ఇంకెక్కడిశాంతము. అన్నియు దుఃఖభాజనములేయయ్యెను. ఓ చిత్తమా! నీకోర్కెలన్నియు నిష్ఫలమైనవి. ఇఁక నైన ధైర్యావలంబకురాలవుకమ్మా.

(దుఃఖముతో)

ఓప్రాణములారా! మీరు మీస్థలాంతరములకుఁ బొండు. ఓకట్న పిశాచమా! నీసాహసమును బూర్తిగ వెలిఁబుచ్చితివి. అట్ట నాజననీజనకులకు——

సీ. కలసంపదలెల్లను కాఁజేసి క్షణములోఁ
దినదిండిలేకుండఁ జేర్చినావు
కన్నబిడ్డనుగాంచి కలకాలమింటను
గుందుచుండెడు చింతఁ గూర్చినావు

బందుగులెదుటను, బడకుండ నిత్యము
తలవంపుఁ గూర్చియు దరలినావు
కడుపునఁ బుట్టిన గారాబమంతయు
విడిపించి యిచ్ఛతో వెలిగినావు
గీ. హేయమనిపించిమాధు నింతంత జేసి
యప్రియముఁ జూపి సనుసాగ నంపినావు
ఇట్టిసుగుణాలరాసివే యెన్న నిన్నుఁ
జేర్చుటరయఁగ రక్కసిఁ జేర్చుటగును.

పోనీ, నీమూలమున ధనార్జనను జేసిన వారినైన బాగానవ్విపెతివా? అదియును లేదే. నామామగారు——

సీ. నీమూలమునగదా నీచముచ్చము లేక
కొంపలఁగూల్చగఁ గోరినారు
నీమూలమునగదా నిర్లజ్జ్యమును జూపి
పరునిబంపక వట్టుఁ బట్టినారు
నీమూలమునగదా నీతిఁదప్పగఁ బుత్రుఁ
బెఱటిదారిని జూపి పేర్చినారు
నీమూలమునగదా నిమిషమాత్రంబున
దగ్ధమై భువినుండి తరలినారు
గీ. ఉభయపక్షులవారిని నూడ్చి వెనుక
సంతసంబున నుంటివే చాలుఁజాలు
శాపదగ్ధవు కావా కన్యా! చావు లేదు?
ఆదరించిన వేరుడే! హాళ మొనర్ప.

ఇన్ని రీతుల యత్నము సేయుట తెలియక మనుష్యుల, నిర్మూల మొనర్ప లేకదా. నీవి కలికాలమందు కలిగిత్తైవై జనుల బాధింప బయలు వెడలితివి కాఁబోలును, కానిమ్ము, నిన్ను ననేల ?

గీ. రమ్మురా రమ్మటంచును రగుల్చే జేసి
మూఢబుద్ధిని నిమ్మళీరీ వక్షరియుచుండ
నీదు తప్పిదమిందును లేదు లేదు
దూషణల్ సేయ మాదియే దోసమగును.

(ఆలోచన నభినయించి)

ఈతనిపల్కులు నిక్కములగునో, కాకుండునో? ఇంతటితోనే విరక్తిని జేసికొని ప్రాణములవీడు టంత శ్రేయముకాదు. ఆవేశ్యా గృహమునకుఁగూడఁ బోయి సత్యమును గ్రహించి మఱియు ముందు యత్నము లాచరింపఁదగునుగాక. దాని నెట్లు తెలిసికొనఁ నగును? వారుసత్యమును దెల్పుదురా? అయినను బ్రయత్నమునుమాని ముందేజీవముల బాయుట యవినీతియగును. నోట నాలుకయుండ, గృహమును గనుఁగొనఁజాలకుందునా?

(అని నిష్క్రమించును.)

---

మూడవరంగము.

---

(ప్రదేశము—వేశ్యాగృహసమీపము.)

(ప్రవేశము—రుక్మిణి.)

రు.—ఈవీధిని దిలఁకించుటతోడనే, మోసమునకుఁ దావు, మోసమునకుఁ దావని మానసము బోధించుచున్నదే. వీరేకదా, కామమదాంధులగువారిని గులభ్రష్టులుగఁ జేయఁజాలెడు శక్తికలవారు. వీరేకదా యెట్టిధీరులనైన నిమిషమాత్రింబున దమమాయచే వశీకరణఁజేసికొనఁదగు సామర్థ్యముఁగలవారు. వీరేకదా క్షణకాలమున లక్షాధికారుల భిక్షాధికారులుగ

మూర్ఖ౯జాలువారు. ఏనెంతయువినీతిని. వీరిని నిందించు టేటి న్యాయము ? కామమదాంధులై యొడలెఱుంగక తమ యిం డ్లకు వచ్చినవెనుకఁగదా తమనటనలఁ జూపి వలలఁజిక్కఁజేసి కొనుట. మనపదార్థము మంచిదికాకున్న, కంసాలిని నిందింప నేల? తర్కవితర్కంబుల కిదనుగాదు.

(ఒకవైపునకుఁ దిరిగి) అయ్యా ! మణిమాల గృహ మెచ్చట ?

(ఏమికోూవినుట సభినయించి) ఏమి? యిదియేనా ? (సమీపించి ఎవ్వ రీలోపల ?

(తెరలో)

ఎవ్వరు వారు?

రు___ఏనొక మార్గస్థురాలను.

(తెరలో)

పనియేమి ?

రు___తలుపు నొకసారి తెఱువుఁడు.

(తలుపుఁదీసి శ్రీహరి ప్రవేశించును.)

శ్రీ___ఎవ్వూరమ్మా ! ఇదేంటి. పడుసుపిల్ల లీయేసమేంటి ?

రు___దిక్కుమాలిన దానను.

శ్రీ___అదాకథ. ఛా. లోపలికిదా. సెట్టుమీఁద సిలకలాగున్నావు. మాలమ్మాయికాసి, యీ బేరాలు నాకుఁదెలియవు.

రు___(తనలో) ఏమిది ? ఈపెపల్కులు నాకర్థమగుటలేదే. బేరము లేమి ?

శ్రీ___ఏంటాలోచిత్తున్నావు ? కూకో మ్మాలమ్మాయిని కేకేత్తాను. అమ్మాయీ !

(తెరలో)

వస్తున్నానే చీరెకట్టుకుంటున్నాను.

శ్రీ—(రుక్మిణితో) దిక్కులేనిదానవై యీపాటింం యీజేసురుగుళ్లె
లెందుకు ?

రు—అనాధలకు శరణంబగు వ్రతమూనితిని.

శ్రీ—ఏంటమ్మా! అతమా ? ఏంపల్కులమ్మా. చిల్కపల్కులు.
ఏంగతిపట్టిందేతల్లీ. ఇఁక సుఖపడుదుగానిలే.

రు—సుఖమా ! నాకుసుఖముపుట్టినాఁటనే వదలెను.

(ప్రవేశము—మణిమాల)

మ—ఏమమ్మా ? యెందులకు ?

(రుక్మిణిని జూపి) యీపె యెవ్వరు ?

శ్రీ—ఈపిల్లకెవ్వరూ దిక్కులేరంటే లచ్మీదేవివలె మనయింటికాడి
కొచ్చిందే. నీకు అప్పచెల్లెల్లు లేనందుక యిది నీచెల్లెలనుకో.

(రుక్మిణితో) మాయింటికాడుండమ్మా. ఇం కిశ్శాక్షంతూమా.

రు—(తనలో) వీరియుద్దేశ్యమేమియో నాకుబోధపడుటలేదు. తడ
యుటకు సమయముకాదు.

(ప్రకాశముగా)

మీయాదరణకు సంతసమయ్యెను. ఏనొక కార్యార్థినై వచ్చి
యున్నాను.

శ్రీ—కార్యార్ధియా అంటేయేంటి ?

రు—ఒకపనికొఱకు వచ్చియున్నాను.

శ్రీ—మాకూ తెల్చిందిలే. నీనోటితోకూడా సెప్పు.

రు—మీరు సుందరంగారి నెఱుగుదురా ?

శ్రీ—ఏమోఅమ్మా! చుందరం యెవడో మాకు తెలియదు. ఆయనకు
నీకు యేంచంబంధము?

రు—దాఁచనేల ? ఆయనయే నాభర్త. ఆయనవనుదర్శించి సేవఁజేయ
వలయునని వచ్చియున్నాను.

శ్రీ—అలాగంటమ్మా. అప్పుడే వొర్లిపోయెడు. పాపం నీకూట్లో మ్మాన్నే చేడు.

(మణిమాలతో)

చూచావంటే సుందరం పెళ్ళామంట. చిలకలాంటి పెళ్ళాని యిడ్చి పెట్టాడు. ఈపాపమంతా ఆయనచలో డిది. ఈడిజిమ్మాడ. యేక డబ్బాళచే ఏంబావుకున్నాఁడు. యిలాంటోళ్లని యేడిపిత్తేనే, ఉన్నదికూడా యూడింది.

రు—సత్యమునుదెల్పి పుణ్యముఁ గట్టుకొన్నాఁడు. ఆయనదర్శనము కాని నాఁడు ప్రాణముల విడుటకే నిశ్చయించుకుంటిని.

(ఒకరిమొగము లొకరు చూచుకొందురు.)

శ్రీ—మనకు భయమేంటే. పడుత్తోంది. చంగతంతా చెప్పు.

మ—అమ్మా. ఆయన కొలఁదికాలముక్రిందటనే, ధన మీయలేదని మేము తిరస్కరించుటచే వెడలిపోయినారు. ఈయూరున మాత్రము లేరు.

రు—(కన్నులనీరునింపుచు) అయిన నేఁబోయెదను.

శ్రీ—ఏంటమ్మా మాయింట్లో యుండు. నీకేయిధమైన లోటులేకుండా కాపాడేప్రాచీనాది.

రు—(వినకుండగనే నిష్క్రమించును.)

(తెరపడును.)

(ప్రవేశము:—సన్యాసివేషముతో సుందరం)

సుం—హా! ప్రాణేశ్వరీ! నిన్నన్యాయంబుగా నిడుమలపాలొనర్చిన నీ పాతకమున కట్టిశిక్షవిధించి పుణ్యముఁగట్టుకొందువో కదా నాఁకనిఁడెన్నఁడును గట్నమున కాసించి చేతులొగ్గనో నాఁడే నేను నీయధీనమైతిని. నాఁటినుండియు నీవే నాకు యజమానురాలవు—

గీ. విక్రియంబునకంచును ఫీధిఁబెట్టఁ
దగినధనమిచ్చికొనిరొ నీ తండ్రినన్ను
కాన నాఁటినుండియుఁగూడ నేనెనీకు
దాస్యమొనరింపవలయును దప్పకుండ

ఇంతదనుక నీఋణమును దీర్పలేకున్నను నిఁక ముందైన ఋణవిము క్తునిగ నొనర్పవలసిన భారము నీయందే నిల్చియున్నది.

గీ. అతివయేయెందుఁ బురుషున కర్ధదేహ
మంచుబుధులును శాస్త్రంబు లార్చుచుండు
సుదతివలననె యిహపర సుఖముకల్గు
అదియె కలినయ్యె సైగను చప్పరపడితి

---

(నాల్గవరంగము)

---

(ప్రదేశము:—ఒక దేవాలయము.)

(ప్రవేశము—సన్యాసి యగు సుందరం)

సుం—ఆహా! ఎట్టిమూర్ఖునకైనను విరక్తి కల్గినవేళ భగవదారాధన యే యిహపర సాధనమనితోఁచునుగదా. అందువలననే తొలుత సంసారాంధకారంబున మునింగిననే కాని యందుండెడు మమకారము నశించి మోక్షాభిలాష కలుగకుండునని గదా! శాస్త్రంబులు ఘోషించుచున్నవి.

గీ. కలిమిచేఁ దులతూఁగెడు కాలమందు
పుణ్యపాపంబులనియెడు స్ఫురణరాదు
చావుపుట్టుకలనియెడు స్మరణలేదు
ధనముపోయిన మఱునాఁడు తప్పకుండ
దైవప్రార్థనయేగతి ధాత్రి నెపుడు.

ధనమున్నంత కాలము బంధువర్గమన్న పరమతిసహ్యమగును. కావర మేయందు ప్రిధమ కర్తవ్యము. నీచప్రివర్తనలకే యుదితగిన నెలవు. ఆ దుష్టత్వముచే వ్యభిచారమునకుండా వొసంగిన—

చం. ధనము నశించు మానమును దప్పదు వీడుట కావరంబునన్
 అనయమునిందలున్గలుగు యాదర మెందును గానరాదుగా
 వినయము మాయకాశడకు వీనులఁ బెట్టరుపల్కులెవ్వరున్
 అనువగు తావుకల్గదిఁక నంతమనందగు సాని జేరినన్

కడచిన దానికై కలఁతనొందుటకంటె నన్నిదుఃఖముల నంతమొందింపఁ దగు భగవన్నామస్మరణమే సుఖదాయకంబగును.

(అనికనులమూసి ధ్యానింపమొదలిడెను.)

(తెరలో)

రు—ఓపరమాత్మ స్వరూపా! ఆది మధ్యాంతరహితా! నిత్యానంద నిత్యస్వరూపా!

మ॥ అవసానంబున నన్ని చింతలను నాయాసంబునన్ డించి యీ
 భువిఁ దాఁజేసిన పాపసంగతుల నిర్మూలంబుగఁ ద్రోయగా
 భవదీయాకృతి సేవ్వఁ జెంచు మదిలో భక్తుండగున్ తద్విధిన్
 యవలీలం లభియింప నీదయను స న్నాలింపవే మ్రొక్కెదన్

సుం—(కన్నులఁదెఱచి) ఈయార్తారవ మెవ్వరిదై యుండును? (నలు వంకలఁ దిలఁకించి) ఈ చుట్టు ప్రక్కలనెవ్వరును గానరా కున్నవారే.

రు—(తెరలో) ఓతండ్రీ! జగన్నాయకా! చిన్ననాఁటనుండియు...

గీ॥ సంతసంబున నెద్దియో సౌఖ్యమెసగ
 నెట్టులుండునో కనలేక యిడుమలంద
 శల్యగతమయ్యె కాయము సానుభూతి
 నదియు విడనాడి నినుజేరఁ గదలుచుంటి

సుం—(వినుట నభినయించి) ఎవ్వరో యొక యనాథయగు వనితా రత్నము జీవములఁ బాయ సిద్ధమగుచుండెను. తడసిన ప్రమాదము సంభవించును. పోయి సంరక్షించెదనుగాక !

(అని నిష్క్రమించును.)

(తెఱ యెత్తఁబడును.)

(రుక్మిణి మెడ కురిత్రాఁడు దగిలించుకొని ప్రాణములు వాయ సిద్ధమగుచుండును.)

సుం—(తత్తరముతో) ఆగుమాగుము. సాహసము వలదు. ఆత్మహత్య మహాపాతకము. (అని కేక లిడుచు వచ్చి యాత్రాటిని గోసివేయును.)

రు—(నివ్వెరపడి చూచుచు) హా ! భగవానుఁడా ! ఇంకను నాకీ యాపదలనుండి విముక్తియే లేదా ? "పాపీ చిరాయు" వన్నట్లు ప్రాణమున కంతముఁ గల్గించుకొంద మన్న దీనికిని నంతరాయముఁ గల్పించితివే.

(సన్న్యాసికి నమస్కరించి)

ఆర్యా !

గీ. దుర్భరంబయ్యె కాయము దుర్గతులను
బ్రదికియున్నంత దుఃఖంబు ప్రబలముగను
దినదినాభివృద్ధిని జెంది దిగులుతోప
సిద్ధమైతిని బాయంగ జీవములను.

ఈపాపాత్మురాలి జీవముల కేల యడ్డు వచ్చెదరు ?

స—తన్వీ ! కష్టసుఖము లందఱికి సమములే. కష్టకాలమందు విరక్తిమార్గ మలవడుట సహజమే కాని యాత్మహత్యకుం బాల్గొనుట సెల్లునా ? అంతమాత్రమున పాపవిముక్తి కానేరదు. ఎవ్వరవీవు ?

రు__స్వామీ ! నాచరిత్రను వినిపించి శరణ్య లగు మీకుఁగూడఁ జింత కల్గించుట తగనిదని.

స__అట్లుకాదు. నాకోపినంతమట్టుకు సాహాయ్యముఁ జేయువాఁడ. నీకీ వేసమున యుండవలసినంత యగత్య మెందులకు సంభవించెను ?

(తనలో) ఈమెను దిలకింప నేకతముననో యమితం బగుజాలి దుఃఖము గలుగుచున్నయది. మా కిర్వుర కేదియో బంధుత్వ మున్నటుల మనమ్మునం దాందోళనయు నంతకంత కతిశయించుచున్నది. కారణ మేమై యుండునో కదా__

రు__అయ్యా ! భర్తృవియోగానలంబున మ్రగ్గుచున్న నాకిఁకఁక నిహాలోకసుఖంబు లలవడునా ? .

స__(తనలో) భర్తృవియోగమా ! ఒకవేళ నాసతి కాదుకదా? అంతటిభాగ్యమా నాకు ? ఓ హృదయమా ! నీ కెందులకింత యాతురత ?

(ప్రకాశముగా) కాంతారత్నమా ! భర్తృవియోగ మెందుల కబ్బెను ! నీయట్టి సుగుణాలరాసిని వీడిన యా మహాపాతకుం డెవండు ?

రు__అయ్యా! నిష్కారణముగ నాయనను నిందింపనేల? నేనే యట్టి మహాపాతకురాల నగుటంబట్టి నా కీయవస్థ సంభవించినది.

స__ఆహా ! ఏమి ? యీమె సుగుణత్వము. పతివ్రతల కుండఁదగు లక్షణము లివియేకదా.

ఉ. దూరదు పీడెనంచు మది దోసము లెన్నదు పాపుఁడంచు వే
మారును దుఃఖమందుచును మానక చేసిన కర్మమెంచు నే
కారణ మింత తెల్ప దిటు కాంతలకెందును నోర్పుగల్గునే
పోరున నిట్టి దుర్దశలఁ బొందిన సుందరి గాంచనేర్చునే.

(ప్రకాశముగా) సుదతీ ! నాయెడ నొక్కటియు దాచక వెలిబుచ్చుము.

రు—ఏమని తెల్పుదాన ? ప్రాణదాత లగుటచేఁ జెప్పక తప్పినది కాదు. ఈదీనురాలిచరిత్ర నాలించుడు. నాజనని లో జన్న కుఁడు—

గీ. వలదు వలదంచు బలికిన భాగ్యమంచు
ఉన్నసంపద లర్పించి యొకని కీయఁ
గట్న మింకను జాలక కడకు మాకు
వేఱుపఱచెను నన్నును విభునినుండి.

స—(తత్తరముతో తనలో) నాతలంపు లన్నియు నిక్కము లగు చుండెనే.

రు—రానురాను బుట్టినింటివారికిని ససహ్యముతోప

గీ. భర్తృశుశ్రూషయే నాకు భావ్యమనుచు
నెంచి వెదకుచుఁ బతియిలు వెదకిచూడ
(కన్నుల నీరు నింపుచు)
నాదుదురదృష్ట వశమున నాధుడకట
ధనమునంతయుఁ బోఁగొట్టి తరలె నెటకొ.

స—(విచారముతో) సుదతి! నీయత్తవారిదేయూరు ?

రుక్మి—మధురాపురము.

స—(కన్నుల నీరునింపుచుఁ దలవంచి యూరకుండును.)

రుక్మి—హా! నాధా! (అని యాతని పాదములపై వ్రాలెను.)

సుం—(లేవనెత్తి) తన్వీ! చింతింపనేల? ఏను దుదకు నీవలెనే పడరాని యిడుమలంబడి యిట్లు సన్యాసినై భగవదారాధనా నిమగ్నుఁడనై తిని. ఈపాపాత్ముఁ డిప్పుడు నీవెట్టిశిక్షవిధించిన ననుభవించుటకు సంసిద్ధుఁడై యున్నాఁడు.

సీ. పతి పాదసేవయే సతులకు సతతము
పరమపావనమను పడఁతిమిన్న
భర్తను విడినాడి బ్రతికియుండుటకన్న
మరణమే మేలను మాన్యచరిత
పాపిష్ఠునైననుగాని ప్రాణేశ్వరుఁడె తన
భాగ్యభోగములను భావనాత్మ
బంధుజనులఁబాసి మగనిజేరఁగనెంచి
సంచరించెడునట్టి సదయహృదయ

గీ. కలిమి లేములు సమమను కలికి నకట!
ఆదరింపకవీడిన యధముపీని
యిచ్ఛవచ్చినరీతిని యిహమలందఁ
దగిన శిక్షనుజూపుమా తరుణి! యింక.

రుక్మి.—నాథా! యిదియేమి? భర్తలను భార్యలు శిక్షింపవలెనా? ఇదియుఁగాక, యిందు మీతప్పిద మేమున్నది?

గీ. జనకు నాజ్ఞను జవదాటి సంచరింపఁ
బాప హేతువుకాదొకో! పరఁగనిట్లు
విధియనంగను సెల్లెదు వింతయేల?
నాదుపాపంబె యీగతి నన్నుఁజుట్టె.

సుం.—తరుణీ! నాపుణ్యవశమున నేవిధముగనైన నిన్నుఁ జూడఁ గంటిని.

రుక్మి.—ప్రాణేశ్వరా! మీకు నాయందిట్టి యపారప్రేమ. యుండుట వలననే నేను గడుధన్యురాలనైతినని యెంతయు నుప్పొంగుచున్నాను.

సుం.—కాంతా! నీజననీజనకులు నిన్నెడఁబాసియుంటచే నెంతగఁ గుందుచుండిరోకదా, వారిని వదలి, యీనిర్భాగ్యుని కోరి

కేల యోచించితివి? ఇప్పుడైన నీవు వారికడనుండుటయే సుఖం
చుట శ్రేయోదాయకముగ నుండునని నాతలంపు.

రుక్మి—అయినఁ గావచ్చును గాని, మిమ్ములవీడి క్షణకాలమైన
నిలువనోపను. ఇరువురముకుగూడ నిచ్చటనే భగవదారాధ
నల సలుపుచుఁ గాలమును బుచ్చుదము. ఏమందురా?

గీ. మీకు భగవదారాధన సోకు ముక్తి
భర్తసేవలఁజేయుట వలన నాకు
మోక్షసాధన మలవడు ముక్తికాంత
నిరువురము జేరవచ్చును నిందువలన.

సుం—బాగు! బాగు! అట్లనే యొనర్చుదము. ముందుగ మన
మిప్పు డెయ్యది ప్రస్తుతకాలంబునఁ బ్రజలపాలిటి పెనుభూ
తమై దెగటార్చుచుండెనో, యెయ్యది సతిపతుల నిష్కారణ
ముగ నెడఁబాప దుఃఖములందఁ జేయుచుండెనో, యెయ్యది
క్షణకాలంబున లక్షాధికారుల భిక్షాధికారులుగఁ జేయుచుం
డెనో, యట్టి యీవరకట్నములబాధను దొలఁగింపను, నాం
ధ్రభాషామతల్లిని నుద్ధరింపను, భగవాను నొక్కమాఱు
ప్రార్థించి పోవుదము.

రుక్మి—చిత్తము.

(ప్రదేశము— రామచంద్రరావుగారి గృహము.)

(ప్రవేశము—రామచంద్రరావు.)

రా—కటకటా! రానురాను నిందలధికంబై మనంబునఁ గుదుఱులేక
నిద్రాహారములకు దూరుఁడ నగుచుంటినిగదా. అయ్యో!
యింకేమి తెఱువు? కులకాంత యెన్నివిధములఁ జెప్పినను
వినదాయె. మిత్రులెందఱెన్నివిధములఁ బోరిడినను, వినక

యున్న సంపదయంతయు క్షణములోఁ బోఁగొట్టి యందున దుఃఖము మఱింత యధికంబై క్రాఁగుచున్నవాఁడను గదా. చూడఁజూడ నాముద్దులపట్టి రుక్మిణి, సుగుణాలంకారిణి, దిన దినము క్షీణించుచుఁ దుదకు శల్యావశిష్టయై యున్నది. ఏమి సేయువాఁడ?

గీ. కట్నమర్పింపఁ జేతను గాసు లేదు
కట్నమీయక కార్యంబు కలుగదాయె
వెనుకఁ గొయ్యి ముందరనుయ్యి యనెడురీతి
ప్రాణసంకట మగుచుండె పాపమేమొ.

ఈయిడుములనందుచు జీవన్మృతుఁడనై యుండుటకన్నఁ బ్రాణము వీడుటయే సుఖదాయకమగునని తోఁచుచున్నయది. ముందువెనుక లాగయక యాచరించుటచేఁగద యిట్లు కుందనయ్యెను.

(ప్రవేశము—దుఃఖముతోఁ గృష్ణవేణి)

రా—(చేరఁదీసికొని) అమ్మా! యేడ్చుచుంటివేల?
కృ—అమ్మ యేడ్చుచున్నది.
రా—(ఆతురతతో) ఎందులకమ్మా?
కృ—అక్కయ్య యెక్కడికో వెళ్ళిపోయినది.
రా—ఎక్కడకు వెళ్ళెనమ్మా. ఇరుగు పొరుగిండ్లకుఁ బోయియుండెనేమో చూచితిరా?
కృ—అన్నియును వెదకితిమి. తుదకుఁ బరుపుక్రింద నీకాగితము దొరకినది. (అని యొకకాగితము నొసంగును.)
రా—(కొంతచదివి కన్నుల నీరుపెట్టును)
కృ—నేను జదివెద. (అని పుచ్చుకొని)
జననీజనకులకు, ప్రియపుత్రిక రుక్మిణి నమస్కారములు.

ఏ నిముసమున జననమందినదాదిగ, నన్నుఁ గనినందులకు మీకపార దుఃఖ మనుభవించుటయే యయ్యెను. ననుఁబోలు పాపిష్ఠురా లీవుడమి వేఱొక్కతె యుండుననుట కలలోనివార్త. నాసుఖముకై తాము మీకుంచుకున్న సంపదలెల్ల ధారవోసినను మఱకుఁ చింతాక్రాంతులగుటయేకాని తత్ఫల మనుభవించుభాగ్యము నాకు లేకపోయెను. ఇట్టిదుఃఖ మనుభవించుచు జీవముఁ దాల్చియుండుటకన్న మరణమే శ్రేయోదాయకమని పొడగట్టుటచే లభించినఁ బతిశుశ్రూషఁగావించుచుఁ గాలముఁబుచ్చుదమనియు, లేకున్న... వ్రాయుటకుఁ జేయి యాడకున్నయది. అందువలన నాకు భీతిజనించి కాదు. మిమ్ములఁ బరితాపమున ముంచుదునేమో యనియెడు సంశయమే. ఏమమ్మ మీపాలిటి గక్కసినిగాని, ముద్దులపట్టినిగాని విశ్వసించుఁడు. ఇదియే మీకిరువురకు కడసారివందనములు. కృష్ణవేణి నావలెఁగాక చిరంజీవినియై, సదా సుఖపరంపరల నోలలాడునుగాక. నాతప్పులమన్నింపుఁడు. ఇందువలన జననీజనకులైన మీకు సంతాపము కల్గించినదాన నగుదునని యెఱుంగుదును. కాని, నిత్యము మీకన్నుల యెదుటనుండి చింతను గల్పించుటకన్న నిదియే వేయిమడుంగు లెక్కుడు మేలని యోచి యిట్లొనర్చితిని. ఇంతటినుండి రుక్మిణి మీగర్భమునఁ జనించియుండలేదనియే తలంచుఁడు.

ఇట్లు, రుక్మిణి.

రా—హా! పుత్రీ! (అని కొంతవరకు మాటాడనేరక). అయ్యో! ఎంత సాహసమొనర్చితివి? మాదుఃఖములకు నీవెట్లు కర్తవైతివి? ఏమొనర్చిన పాపకర్మముల ఫలిత మనుభవించుచున్నాము. తల్లీ! ఆవిచారమునకన్న నిది తక్కువ యని తలఁచితివా? నీకిఁక బతిశుశ్రూష యెట్లులభించును? కొంత యూరటఁజెందవలయు ననియిట్లు వ్రాసియుంటివి కాఁబోలును. నీసౌఖ్యమునకుఁ గాదె మేమిన్నిపాట్లను బొందుట. అట్టి నీవు కటకటా! మాకడుపునఁ జిచ్చువెట్టి యేగు టెట్టిన్యాయ

ము! ధనము పోయినందులకుఁ జింతిలుట లేదు కాని, నిన్ను
గాపురమునకుఁ గూర్చిపంపలేకుంటిమి కదా యని సహస్రవిధంబుల
పరితపించుచున్నారము. గోరుచుట్టుమీద రోకటిపోటు [illegible]వ
ట్టిక మాచింతలకు అంతరాయమే లేకుండెనా! [illegible] ఇన్ని
సంకటములకోర్చి మనియుండ శక్యమగునా!

కృ—నాన్నగారూ! అక్కయ్య నగలన్నియు [illegible] విడిచిపో
యినది.

రా—ప్రాణముల వీడ సిద్ధముగ నున్నదానికి నగలెం…—

కృ—అయితే అక్కయ్య యికఁ నింటికి రాదా!

రా—వచ్చునమ్మా. ఏడువకు.

(ప్రవేశము—దుఃఖముతో విశాలాక్షి)

వి—హా! నాథా! మన కొంపకూలినది. (అని పాదములపై బడును)

రా—(విచారముతో లేవనెత్తి) ఏమిచేయుదము. తొలిఁ జేసిన పాపమం
చయ మీగతిఁ గట్టికుడుపుచుండెను. వలదన్న యెన్ని రీతులఁ
దెల్పినను వినకుంటివి కదా. మనమా దరిద్రులమైతిమి. దాని
కా సౌఖ్యమన్నది లేకపోయెను. మన నారాయణరావున కిచ్చి
పెండ్లిఁ జేసిన నిరత పుట్టువునుఁగల పోవునుగదా.

వి—అయ్యో! నాథా! ఈదుఃఖమెట్లు భరింపగలను? కన్నపుత్రిని
జేతులారఁ జంపుకొంటిమే. మనవంటి దురదృష్టవంతు లెం
దైన నుందురా?

రా—తన్వీ! జరిగినదానిఁ గూర్చి యెంతగ దుఃఖించినను నిష్ప్ర
యోజనము. దీని కంతకును కారణభూతుఁడను నేనే. పోయి
వెదకెదను. పతిశుశ్రూషయనెను. మనల నూరడింపఁ జేయుట
కిట్లు వ్రాసియుండెనేమో—

వి—ఇంకెక్కడి పతి? ఎక్కడి శుశ్రూష?

రా—రాత్రి రెండుజాములు మీరినవేళ నేనావిలికిఁ బోవునప్పుడు
పక్కమీఁదనే పరుండియుండఁ గాంచితిని.

ప్ర—నిన్నటి సాయంకాలము గదిలో గూర్చుండి యేమియో వ్రాయుచు నన్నుఁజూచి యాకాగితమును బఱుపుక్రిందఁ దాచి వైచినది. అదేమని యడుగ నేమియు లేదనియె.

రా—...టినుండియు నీప్రియత్నము మీఁదనే యుండెనుగాఁబోలు ...ప్రతిదినమున నేను గచ్చేరినుండి వచ్చునరికి నెదుఱుగ ...పలుకరించెడిది. నిన్న నట్లు వచ్చియుండలేదు. ...కుంటిని.

వి—నిన్న...డియేకాదు. ఈఁదుమఁ బదిదినములనుండి యొంట...ర్చుండి ప్రతిదినమున నేదియో యాలోచించుచునే ...ది. ఆ ఆలోచనలన్నియుఁ దుదకు మన గొంతుకల...కేయయ్యెను. ఇన్నివింతలు జరుగుటకే కాఁబోలునప్ప...తనుండియు నన్నియు శుభసూచకములే.

రా—చూచితివా! భాగ్యవంతులు భాగ్యవంతులని పరుగులిడితే పిల్లఁగూడఁ దక్కకుండఁబోయెను. ఒకవేళ బ్రతికియున్నను దిండిలేక యెక్కడ మాడుచుండెనో! మనకుఁ దగిన ప్రాయశ్చిత్తమైనది.

వి—కటకటా! ఈనిష్ఠురములేల? కన్నపుత్రికి దుర్గతులఁ గల్పించిన పాపి నగుటవలననఁగదా—

సీ. బంధుగు లందఱు నిందఁబుచ్చుదురంచు
వరకట్న మీయంగవలయునంటి
నోడివారిలలోన దోషంబులేకుండఁ
జేయంగవలెనని చేరమంట
కట్నమీయకయున్న గార్యంబెకాదని
మందబుద్ధిని నిట్లు మసలుకొంటి
కన్నపుత్రికి సౌఖ్యమన్న నిదేయని
ముందువెనుకలేక మోసపోతి

గీ. బంధుగులు లేరు ధనమెల్ల మంటఁగలియ
సౌఖ్యమునకుమాఱు పుత్రికిఁ జావుకల్గె